## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015815

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# దానబలి.



## (వామనచరిత్రము)

[మహాభాగవతమందలి పద్యములతో రచియింపఁబడిన

ఐదంకముల నాటకము.]



పండిత, సీతారామ కృతము:—

ప్రకటనకర్తలు:—

## దుర్గా అండ్ కో

ఏలూరు.

ఏలూరు:—శ్రీ పాండురంగ ముద్రాక్షర శాలయందు,

పి. వి. మునెయ్య & కె. వి. రామయ్యగార్లచే,

ముద్రింపఁబడినది.



వెల 1—0—0

# పీఠిక

ఈ కాలమున నాటకములకుఁ గొఱఁతలేదు. అందులకుఁ దగినట్లు ప్రకటనకర్తలకంతకంటెఁ గొఱఁతలేదు. ఒక ఫారమ్ (8 పేజీలు) ఏదో హాస్యరస సంబంధమయిన పుస్తకమును వ్రాయించి "రైలు వాఙ్మయముగాఁ బ్రకటించినంత మాత్రముననే "బుక్‌సెల్లర్ అండ్ పబ్లిషరు" అను బిరుదమును గ్రంథవిక్రేతయందుచున్నాడు. వ్రాయువారున్నప్పుడు ప్రకటించువారేల యుండరు? నేను నాటక రచనకు నమస్కరించి చిరకాలమయినది. నాటకములన్న మిగుల యరుచి కలిగిన ఈ దినములలో మరల నేను నాటకమును వ్రాయవలసి వచ్చినది. నా మిత్రులును, శ్రేయోభిలాషులును, నిర్వచన నిరోష్ఠ్య సుందరీసుందర చరిత్ర్యాది గ్రంథకర్తలును నగు మహారాజశ్రీ డాక్టరు బుద్ధిరాజు శేషగిరిరావుపంతులుగారు, నాయందుండు ప్రేమచేత కాఁబోలు, భాగవతమందలి వామన చరిత్రమును సందర్భము ననుసరించి యందలి పద్యములనే యుంచి ప్రదర్శనార్హముగ నుండునట్లు నాటకముగ వ్రాయఁ బ్రేరేపించుటయే యిందులకుఁ గారణము. బాల్యమున పురాణవిద్యాభివృద్ధి కాటంకము గలిగించి, కొంచెముగ నన్నుఁ జేరిన నాటకానుభవము మనంబునందుంచుకొని, ఈ నాటకము రచించితిని. ప్రదర్శనార్హమగునని తోఁచునేని నటకులు దీనిం బ్రదర్శించి నాకు మోదము గూర్తురు గాక యని కోరుచున్నాను. ఇందలి మంచిచెడ్డలు గ్రహిఁచుటకు రసగ్రహణ పారీణులుండిరికదా!

ఏలూరు,
27—8—29.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
డా॥ సీతారామారావు.

# ఈ నాటకమునందు వచ్చుపాత్రలు.

పురుషులు.

ఇంద్రుఁడు—అమరాధిపతి.

జయంతుఁడు—ఇంద్రుని కుమారుఁడు.

బృహస్పతి—అమరులకు గురువు.

మణికంధరుఁడు—ఇంద్రుని భటుఁడు.

బలి—దానవ చక్రవర్తి.

శంబరుఁడు—బలియొక్క మంత్రి.

కాలనాభుఁడు—రాక్షసుఁడు.

శుక్రాచార్యులు—దైత్యులకు గురువు.

కశ్యపుఁడు—ముని

గాలవుఁడు } కశ్యపుని శిష్యులు.
జాబాలి }

రామశాస్త్రి } బ్రాహ్మణులు.
సోమయాజులు }

ప్రహ్లాదుఁడు—బలియొక్క పితామహుఁడు.

బ్రహ్మ—సృష్టికర్త.

స్త్రీలు.

అదితి—అమరమాత.

సంధ్యావళి—బలి భార్య.

ప్రియంవద—చెలికత్తె.

రంభ—అమర వేశ్య.

[ఇంకను బ్రాహ్మణులు—సేవకులువత్తురు.]



# దానబలి.



## —:నాందిః—

మ. నతసర్వామరమూర్ధభాగ్మకుట సం ♦ తానంబునన్ వేనికాం
తితతుల్ పంకజరాజ కందళములై ♦ దీపించుచుం డెవ్వినం
స్తుత నానామునిమాన సచ్ఛల గృహ ♦ స్తోమంబులందివ్వలై
సతతంబింపగునట్టి వామను పదా ♦ బ్జంబుల్ మిముంబ్రోచుతన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(ప్రవేశించి సభ్యులఁ జూచి తనలో) ఓహో! సభ్యులు నాటక ప్రదర్శనమునకై నిరీక్షించుచున్నారు. ఇఁక నేను తొందర పడవలయును. (ప్రక్కకుఁ దిరిగి చూచి) పారిపార్శ్వకా! నీవొకసారి యిటు రమ్ము.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) ఆర్యా! ఏమి సెలవు?

సూత్ర—ఏమి సెలవని యడుగుచుంటివా! అటు చూడుము! వర్షాగమనమునకు వేచియుండు చాతకంబుల తెఱంగున నీ సభులు మన నాటక ప్రదర్శనమునకై వేచియున్నారు.

పారి—అయినచోఁ గాలహారణమేల ? ఏదో యొక నాటకము ప్రదర్శింతము. ఈ కాలమున నాటకనులకుఁ గొఱఁత లేదుకదా !

సూత్ర—మంచి చెడ్డలు చూడవలదా !

పారి—వానిని విమర్శించువారు తక్కువమంది యుందురు. ఇంతకును మీరేనాటక ప్రదర్శనమున సభ్యుల చిత్తములు రంజిల్లఁ జేయుదురు.

సూత్ర—"దాన బలి" యను నామాంతరముగల వామన చరిత్రము.

పారి—ఓహో ! ఇందేకదా ! శ్రీమన్నారాయణుఁడు అదితికశ్యపులకు వామనుఁడై జన్మించి, వదాన్యుఁడగు బలిం జేరి, మూడడుగులభూమి దానము గ్రహించి, యాతని రాజ్యశ్రీలను మహేంద్రునకుఁ గూర్చెను ? (ఇంచుక యూరకుండి) కథ మంచిదే ! బలి వదాన్యతయు- సత్యసంధతయు మెచ్చవచ్చును ! నాటకము రచించిన దెవరు ?

సూత్ర—

చ. తిరుపతి వేంకటేశ్వర ను ♦ ధీంద్రులఁగొల్చి సిరఃగ్లాఘ్యతా
కర రసపుంజమంజుల వి ♦ కస్వరచారు కథాసుధాధురం
ధర బహుళ ప్రబంధ కవి ♦ తావనితా మహితోక్తి సంపదన్
ధరణిని ఖ్యాతిఁజెందు కవి ♦ తల్లజు నాతని సీవెఱుంగవే.

పారి—శతాధిక గ్రంథకర్తయగు సీతారామాభిధానుఁడా దీనికిఁ గర్త

సూత్ర—అవును. ఆంధ్రమహాభాగవతమందలి పద్యములనుసందర్భమననుసరించి పొందుపఱచి ఆతఁడీ నాటకమును రచించి:— "పరోపకారార్థ మిదం శరీరమ్" అను స్మృతివాక్యార్థము బాగుగ గ్రహించిన విజ్ఞానియు, తన మానసంబును లక్ష్మీ

కళత్ర మరాళకేళికి మానసంబుగఁ జేసిన భర్తాగ్రేసరుఁడును; తన చేతి యీవి యాచకజనపిక ప్రకరంబునకుఁ జిగిర్చిన మావిగ నొనర్చిన దాన దయాపరుఁడును; కృష్ణామండలమున దివిసీమయందున్న నాగాయతిప్పగ్రామ నివాసియు, సుప్రసిద్ధ కమ్మకులీనుఁడును అగు రావుసాహేబు కంఠంనేని వేంకట రంగనాముని కావ్యకన్యకకుఁ బతిగా నొనర్చినాడు.

పారి—సరే! ఈ నాటక రచనవలన గ్రంథకర్త లోకమునఁ గృతార్థుఁడే యగునో, పరిహాసపాత్రుఁడే యగునో మనము చూడవలయును.

సూత్ర—రసగ్రహణపారీణులు దానిని నిర్ణయింపవలయును. అయినను మనకీ సంశయమేల?

మ. కతయా శ్రీహరిలీలఁ దెల్పుకతయే ♦ కర్తా యగణ్యుండు, మే
ల్చతురుల్ సత్కరులున్ సభాజనములా ♦ శాస్త్రజ్ఞులునే బండితుల్
గృతి కన్యాధవుఁడా తలంపఁగను స ♦ త్కీర్తి ప్రతాపాఢ్యుఁడీ
గతిఁజేకూరె సమస్త మొక్కయెడ నిం ♦ క గా సంశయం బేటికిన్.

రమ్ము. ప్రదర్శనమున కుపక్రమింతము.

(నిష్క్రమింతురు.)



# దానబలి.



## (ప్రథమాంకము.)

రంగము:—(పశ్చిమగిరియొద్ద బలి ప్రవేశించుచున్నాఁడు.)

బలి—(స్వగతము)

సీ. నేఁడుగా నాకీర్తి • నిఖిల దిక్కులయందుఁ
బ్రాకించు దివ్యమా • ర్గంబుఁగాంచె
నేఁడుగా నాతల్లి • విక్రమా వీరమా
తగనొప్పు మహిమను • దనరనయ్యె
నేఁడుగా భార్గవు • నిజ తపోమహిమాద్భు
తంబులు సర్వజ • గంబు లెఱుఁగ
నేఁడుగా నేనతి • నిష్ఠతోఁ జేసిన,
వర విశ్వజిద్యాగ • ఫలము గలిగె

తే. నింకఁ ద్రిభువన విజయంబు • నిట్టె గాంచి
దశదిశలయందు నాఘన • యశమునిండ
సకల రాక్షసవీరులు • ప్రకటితముగ
భక్తిమైఁగొల్వ నేనింకఁ • బరగువాఁడ.

ఇంక నాకేమియుఁ గొఱంత లేదు. భార్గవకటాక్షమున విశ్వజిద్యాగము మహావైభవముగఁ జేయఁబడినది. హోమపావకుఁడు నా యెడలఁ గరుణించి, యర్కవాజులఁ బోలు హరులును, కాంచనపట్టబద్ధరథమును, కంఠీరవధ్వజమును, దివ్యధనువును, కవచంబు నొసంగినాఁడు. ఇట్టివానినిఁ గలిగియున్న నన్నింక దురంబున నెవ్వఁడు మార్కొనఁగలఁడు? సురాసుర యక్ష గంధర్వ విద్యాధర కింపురుష గరుడోరగాదులు నా యెదుట నిలుతురే! (ఇంచుక యూరకుండి) దేవేంద్రుఁడు నాఁడు శ్రీహరినిఁ బ్రార్థించి, యాతని సహాయమున నమృతమంతయు దేవతలకిచ్చునట్లు జేసి, రణంబున మమ్ము దాఁకి విజయంబు నందెనుగదా! ఇప్పుడాతని కెవ్వఁడు సహాయము వచ్చునో చూచెదఁగాక! ఆతఁడు నాటి పరాక్రమశౌర్యంబులు మరల నాయెదుటఁ బ్రకటింపఁ దలఁచునో! లేక, మదీయ భుజబలశౌర్య విజృంభణమునకు భీతిల్లి, యడవులకు బాఱునో యరసెదఁగాక! (ఎదుటఁ జూచి) అదిగో! ఆచార్యుండగు భార్గవుఁడు వచ్చుచున్నాఁడు.

శుక్రాచార్యుఁడు—(ప్రవేశించును)

బలి—ఆచార్యోత్తమా! నీ పాదములకు నమస్కరించుచున్నాను. (ఇంచుక యూరకుండి) ఇట నాసీనుఁడవు గమ్ము.

శుక్రా—అభీష్టావాప్తిరస్తు. (కూర్చుండి) వైరోచనా! ఏదియో దీర్ఘాలోచనము సేయుచున్నావే!

బలి—మహాత్మా! ఆలోచన యేమున్నది! దేవాసురయుద్ధమునఁ బడిన దైత్యులను నీవు మృతసంజీవని విద్యాప్రభావంబునఁ బునర్జీవితులుగఁ జేయుటయేగాక, నా యెడల నతి కరుణఁబూని విశ్వజిద్యాగము జేయించి, తత్ఫలముఁ గొనఁజేసితివి. ఇఁక నేను త్రిభువన విజయోద్యోగంబునఁ బ్రవర్తింపవలదా! ఇందులకు జాగు నేయనేల!

శుక్రా—ఇక నీవు తత్కార్యంబునకుఁ గడంగవచ్చును. కొఱంత యేమున్నది ?

బలి—నీ మహదాశీర్వచన మొక్కటి యేకొఱంత.

శుక్రా—నీవు తప్పక విజయలక్ష్మీలాలితుఁడ వగుదువు. సంశయము లేదు.

బలి—(ఎదుటఁ జూచి) శంబరా !

శంబరుఁడు—దేవా ! వచ్చుచున్నాను. (ప్రవేశించును)

బలి—(శంబరునిఁ జూచి) శంబరా ! మన మమరావతిపై రేపే దాడి వెడలవలయును. బలంబుల నన్నియు సిద్ధముఁ జేయుము. మన సైన్యములలో నెవ్వఁడును దాపసులకుఁగాని, బ్రాహ్మణులకుఁ గాని, భక్తజనంబులకుగాని, యేమాత్రము బాధ కలిగింప రాదు. పొమ్ము. నీ ప్రయత్నమున నుండుము.

శంబ—ఆజ్ఞ ననుసరించెదఁగాక ! (నిష్క్రమించును.)

శుక్రా—నాకును వేళయైనది.

బలి—నేనును వచ్చుచుంటిని.

(నిష్క్రమింతురు.)

---

రంగము:—(ఇంద్రలోకము:—సభాభవనంబున ఇంద్రుఁడు సింహాసనాసీనుఁడై ప్రవేశించును.)

ఇంద్రు—(స్వగతము) ఔరా ! ఈ బలిదానవుని సాహసమేమని తలంతును ? మొన్న నాచే సంపూర్తిగ నోడింపఁబడి యసురులతోఁ గూడ నెక్కడికో పోయిన యీ రక్కసుఁడు మరల

నాపై నేఁడు దండెత్తివచ్చెనే! "వినాశకాలమునకు విపరీత "బుద్ధులు పుట్టు" నన్నట్లు, వీనికిఁ జేటుకాలము సమీపించుట చేతనే మరల నాపై కెత్తివచ్చినాఁడు. ఇఁక నీసారి వీనిని బాఱిపోయినను వెన్నంటి సంపూర్తిగఁ బరాభవించి, జగం బదానవముగఁ జేసెదఁ గాక!

జయంతుఁడు——(ప్రవేశించి ఇంద్రునిఁ జూచి) తండ్రీ! మన సైన్యంబులను నాయా దెసలందుఁ గడు జాగరూకతతో నుండ నియమించి వచ్చితిని. ఆ బలి, మన కోటచుట్టును బలంబుల విడియ జేసి మార్గంబుల నరికట్టినాడు. ఇంక నీవాలోచించెద వేల? రణంబునకు నాకనుజ్ఞ నిమ్ము. నేనా దానవనాథుని బలంబులఁ జొచ్చి,

చ. గురుశరపంక్తి నశ్వములఁ ♦ గూల్చి, సిడంబులఁ జెండి, కార్ముకో
త్కరములఁ ద్రుంచి సారథుల ♦ ధైర్యమడంచి రణప్రవీణులన్
విరథులఁ జేసి యంతకుని ♦ వీటికిఁ బంపి సురారినాథునిన్
బోరిఁ గొనివానిఁ గూల్తుఁ బరి ♦ పూర్ణ బలంబునఁ జేర్చి యార్చుచున్.

ఇంద్రు——(ఎదుటఁ జూచి) అదిగో! ఆచార్యుఁడు వచ్చుచున్నాఁడు.

బృహస్పతి——(ప్రవేశించును)

ఇంద్రు——గురువర్యా! ఇటుఁ గూర్చుండుము.

బృహ——(ఆసీనుఁడై) ఏదియో! ఆలోచించుచున్నారే!

ఇంద్రు——(బృహస్పతినిఁ జూచి) ఆచార్యా! బలిదానవుఁడు దర్పించి మహాబలంబులతో మరల మనపై కెత్తివచ్చి యమరావతిని నాల్గుదిక్కులఁ ముట్టడించెను! శ్రీమన్నారాయణుఁడు మన యెడల గరుణించి, మాయా మోహినీరూపంబున దైత్యుల వంచించి, యమృతంబు మన కొసంగినప్పుడే బలికిని మనకును

భయంకర సంగ్రామము జరిగెను. అందు మనము విజయలక్ష్మీ లాలితులమైతిమి. తనవారిం దోడుకొని బలి పశ్చిమశిఖరిశిఖరంబుఁ జేరెను. అట్టివాఁడిప్పు డమరలోకముపై దాడివెడలి వచ్చుట కేమి కారణము! ఇంతలోనె వీనికిట్టి బలంబెట్లు లభించెను. నా చిత్తము వానిం దాఁకుటకుఁ దత్తరమందుచున్నది.

బృహ—

సీ. వినవయ్య దేవేంద్ర ♦ వీనికి సంపద
బ్రహ్మవాదులు భృగు ♦ ప్రవరులర్థి
నిచ్చిరి రాక్షస ♦ నెదుర సంచారింప
హరి యీశ్వరుండు దక్క ♦ నన్యజనులు
నీవును నీసముల్ ♦ నీకంటె ఘనులును
జాలరు రాజ్యంబు ♦ సాలునీకు
విడిచిపోవుట నీతి ♦ విబుధనివాసంబు
వినుతులు సలగెడు ♦ వేళసూచి
తే. మరలి మఱునాఁడు వచ్చుట ♦ మామతంబు
విప్రబలమున వీనికి ♦ వృద్ధివచ్చె
వారిఁ గైకొన నిటమీఁద ♦ వాఁడిసెడును
దలఁగుమందాక రిపువేరు ♦ దలఁపవలదు.

క. పరుగెలువ వలయు నొండెను
సరిఁ బోరఁగవలయునొండెఁ ♦ జావలె నొండెన్
సరిగెలుపు మృతియు దొరకమి
సరసంబుగ మున్నుఁ దొలఁగి ♦ చనవలె నొండెన్.

ఇయ్యది నాకిప్పటికిఁ దోచిన యుపాయము. ఈతఁడు మున్ను

నీచేనోడి, శుక్రాచార్యుని యనుగ్రహంబున విశ్వజిద్యాగము గావించి, హోమపావకుని కరుణచేఁ గాంచనపట్టబద్ధ రథమును, హయములను, గంభీరవధ్వజమును, దివ్యధనువును, కవచంబును గాంచినాఁడు.

జయం—గురువర్యా ! ఇప్పుడు వానిని మనము గెలువఁజాలమా !

బృహ—వానినిప్పుడు గెలుతుమనుట కలలోని మాట. ఒక్క బలియే కాదు. వాని యనుచరులందఱుఁ గూడ నట్లే దర్పించియున్నారు. మనకిప్పుడు మంచికాలము కాదు.

జయం—మహాత్మా ! నీవిట్లు భీతికలుగు వాక్యముల నేల పలికెదవు ? (ఇంద్రునిఁ జూచి) తండ్రీ ! ఆ బలి యెట్టి యాగములు చేసిన నేమి ! మునుపటివాఁడు కాఁడా ! వానింగూర్చి నీవు సంశయింపవలదు. మదీయ ప్రచండ గదాదండభండన పాండిత్యము బ్రకటించుట కిదియే సమయము. అస్మదీయ ధనుష్టంకారకాలాంభోధరగర్జన ధ్వానంబు విన్నచో నేశాత్రవుఁడెదిర్చి నిలుచును ? నిరుపమానాభీల హాలాహల కలికలికా సంకీలితకాలవ్యాళంబు పోలికనుండు మదీయ ఖడ్గమునకా దానవులెల్లరును నాహారము గాకుందురే ! (ఇంచుక యూరకుండి) భండనంబునకు నన్నుఁ బంపుము.

ఉ. ఆహవదోహలుండనయి ♦ యగ్నిముఖంబునసైన వాలి నా
బాహుబలార్భటిన్ రిపులఁ ♦ బట్టి వధించెదు వేళ భూతసం
దోహముతోడ శంకరుఁడె ♦ దుర్పడినన్ వెనుకంజవేయను
ద్వాహము సాహసేచ్ఛఁగని ♦ వాఁడ జయేందిరతో సురేశ్వరా!

బృహ—కుమారా ! జయంతా ! బాల్యదోషముచే నీవట్లు పలుకుచుంటివి కాని మఱియొండుకాదు. ఇప్పుడు వాని గర్వమడఁచు

టకు శ్రీహరి తప్ప మఱియొకరు శక్తులుగా. కావున ప్రస్తుతము మీరు ప్రవిష్టపంబు విడిచిపోవుటయే మంచిది. శుభదినములు వచ్చినప్పుడు మరల రావచ్చును.

ఇంద్రు—మా శ్రేయోభిలాషివగు నీ యనుజ్ఞ ననుసరించెదము. (ఇంచుక యూరకుండి) ఆచార్యా! అమరావతీనగరమునువిడిచి పోవలసినదేనా ! చింతామణీ పారిజాతోచ్చైశ్శ్రవైరావతాది మహాభాగ్య సమన్వితుండనగు నేను రాజధానిని విడిచి యందందుం జరింపవలయునా ! నందనవనారామసీమలయందు విహరించు నేను విపినంబులయందు మూలమూలల డాగవలయునా? మందాకినీతీరస్థపాండుసైకత ప్రదేశములం జరించు నేను కొండలందు వసింపవలయునా ! శుద్ధాంత సౌధంబులయందుం బరిచారికా సహస్రంబులు సురటీలువీవ సౌఖ్యంబున విరాజిల్లు నా యర్ధాంగియగు శచియు, సుకుమార శరీరుండగు నీజయంత కుమారుండును దుర్భర కష్టముల పాలగుదురు కదా ?

బృహ—పాకశాసనా ! నీవిందులకు విచారింపవలదు భగవంతుని మాయం గనుంగొనుట కెవ్వరును శక్తులుగారు. ఈ కష్టమెప్పుడును గాపురము చేయునది కాదు. నీవు త్వరలోనే మరల నీ వైభవమును బొందంగలవు.

(తెరలో కలకలము.)

ఇంద్రు—ఏవియో భయంకరార్భాటములు వినవచ్చుచున్నవి.

(మణికంధరుండు ప్రవేశించును.)

మణి—(తొందరగా ప్రవేశించి యింద్రునిం జూచి) దేవా! జయము జయము.

ఇంద్రు—మణికంధరా! పరుగెత్తుకొని వచ్చితివేల?

మణి—మహేంద్రా! ఏమి చెప్పుదును? దైత్యులు ముట్టడించుటచే మన నగరమంతయు దైత్యులతో నిండిపోయినది. దైత్యేంద్రుం డయిన బలి, యిప్పుడు నీకడకు వచ్చుటకుఁ బయనమగుచు న్నట్లు తెలియుచున్నది. మనమిఁక నేమి సేయవలయును? దనుజులను యుద్ధమునఁ దాఁకుదమా! లేక మఱియేదైన నొక మార్గమాలోచించి యుంటిరా? దేనికైనను మనము త్వర పడవలయును కదా!

ఇంద్రు—బలిని దాఁకుటకిప్పుడు మనకు మంచికాలముకాదు. అమరులు నగరము విడిచి పోవలసినదే. అందఱు నట్లు సేయ నాయాజ్ఞ గాఁ దెలుపుము. పొమ్ము.

బృహ— (ఇంద్రునిం జూచి)

సీ. యుద్ధంబునకురమ్ము ♦ సిద్ధుండవైనను,
యసురేశ్వరుండిప్పు ♦ డడుగకుండ
యిత్తువా రాజ్యంబు ♦ నీయవా యని దైత్యుఁ
డెదురుగా నేతెంచి ♦ బదరకుండ
బలవంతముగ లాగి ♦ భద్రపీఠముపైన
సురశాత్రవుండు కూ ♦ ర్చుండకుండ
భావంబు నొప్పింపఁ ♦ బరిహాసవాక్యంబు
లసురనాయకుఁడు ని ♦ న్నాడకుండ
తే. సర్వమీశుమాయఁగ నెంచి ♦ స్వాంతమందుఁ
జింతవిడనాడి నీవింక ♦ శీఘ్రగతిని
యాలుబిడ్డల దోడ్కొని ♦ యమరపురిని
విడిచి చనుము శుభంబులఁ ♦ బడయఁగలవు.

(తెరలో)

ఇంద్రుఁడెక్కడ ! దైత్యేంద్రుఁడగు బలి యాతని జూడఁ గోరుచున్నాఁడు.

బృహ.— (ఎదుటఁజూచి) ఇంద్రా ! అదిగో వైరోచని యిటే వచ్చుచున్నాఁడు. కానిమ్ము. నీవువీనియెడల నతివినయమును బ్రకటించుచు సంభాషింపుము. తీవ్రత మాత్రము ముఖంబునఁ జేర్పకుము. అదిగోచూడుము.

శా. శుంభల్లీల మహోగ్రశౌర్యధనుఁడై ♦ సొంపొందు కల్పాంత కృ
చ్ఛృంభుండోయన దుస్సహప్రకట దో♦స్సారంబుదీపింపఁగా
నంభోరాసి వితానఁబొంగి సమర ♦ వ్యాపార లీలాకళా
సంరంభుండై యిటువచ్చు దానవుని జే ♦ రంజాల విప్పట్టునన్.

(బలియును-శంబరుఁడను రాక్షసుఁడును ప్రవేశించుచున్నారు.)

శంబరుఁడు—దానవేంద్రా ! మనరాకఁగాంచి నిర్జరులందఱును రాజధాని విడిచి యరిగినట్లు తోచుచున్నది. ఇఁక మనకు సమరముతో నవసరము లేదు. (ఎదుటజూచి) అదిగో! మహేంద్రుఁడు

బలి— (ఇంద్రుని సమీపించును)

ఇంద్రు— (పీఠముదిగి బలింజూచి) దానవలోక చక్రవర్తీ ! ఈభద్ర పీఠము నలంకరింపుము.

బలి—ఎన్నఁడును లేని వినయమును నీవునేఁడు గూర్చియుండుఁ జూపుచుంటివే ! పతాసామ్రాజ్య పీఠ మధిష్ఠించుటకే యీ బలి యరుదెంచెనని నీవుగ్రహించ గలిగితివే ! (ఇంద్రుని సింహాసనమునఁ గూర్చుండి) మహేంద్రా ! చిరకాలమునకు నిన్నుఁ జూడఁ గలిగితిని.

శంబ—పాకశాసనా ! నీవింకను సిచ్చట నుంటివేమి ?

బలి—అమరేంద్రా ! సురసామ్రాజ్యము నాస్వాధీనము జేసికొనుట కే వచ్చితిని.

మ. అరచేతంగల నిమ్మపండుగతినీ ♦ వాడించితిన్నాళ్ళు, శ్రీ
కరమౌ సర్వసుఖప్రదాకరములో ♦ కాతీతసౌందర్యగో
పురమీనాకము ; నింక జెల్లదు, బలా ♦ సూర్యద్రిక్ విజృంభించు ధీ
కరదేవాంతక వహ్ని నడ్డుటకు నీ ♦ కా సాధు కారికిన్.

గౌరవంబుగ సామ్రాజ్యము నర్పించి, నీ యమరావతిని విడి చెదవా ! లేక భీకరసమరతలంబున నన్నెదిరించి నిలిచెదవా

బృహ—దానవేశ్వరా ! మా మహేంద్రుడిప్పుడు నీతో రణంబొనర్ప దలంపలేదు. ఈ సురసామ్రాజ్యమును ధర్మపథానువర్తనుండవగు నీకు సమర్పించి తాను తొలంగవలయుననియే తలంచి యున్నాడు. యుద్ధమునకుం దగుప్రయత్నములేమైన నున్నట్లు నీకు గోచరించెనా ! మీ యసురులను పురప్రవేశ మొనర్చుట కమరులెవ్వరైన నాటంకపఱచిరా !

బలి—ఆచార్యా ! "అందినంజుట్టు; లేకున్న కాళ్ళు" ననుసామెత మీ మహేంద్రుని యందు సార్థకమగుచున్నది. అమృతోత్పాదన ప్రయత్న సమయమున శ్రీహరి నాశ్రయించి, కపట మోహినీ రూపము ధరింపజేసి సకలామర సహితుండై యమృత మంతయుం ద్రావి, యనంతరము ప్రచండ భండనంబున మమ్ముం దాకి జయంబుగొన్న యీ పాకశాసనుని పరాక్రమ మిప్పుడేమూల నడంగి యున్నది ? మందాకినీ దివ్యస్రవంతిలోం గలిసిపోయె నదా ! అసురులను బొఱవోలితినని యానందించెనే !

ఇంద్రు—దానవాగ్రణీ! ఎప్పటి మాటలో యిప్పుడు తలంపనేల?
కాలచక్ర మెప్పటికెట్లు తిరుగునోయెవ్వరును జెప్పఁజాలరుకదా!

బలి—ఈజ్ఞానము నీకప్పుడున్నదా! బలిని గెలిచితినని మిట్టిపడితివే.

ఆ. జయములపజయములు ♦ సంపదలాపద
లనిలచలితదీపి కాం ♦ చలములు
చంద్రకళలు మేఘ ♦ చయములు దరఁగుఁ
మెఱుఁగు లమరవర్య ♦ మిట్టిపడకు.

ఇఁకనీయధికారమీసురలోకముపై సాగదు. ధర్మసంస్థాపనార్థమే నేనీ బృందారక రాజ్యలక్ష్మిని వశపఱచు కొనుచుంటిని. ఇదియే నానిజమైన యభిప్రాయము. సామ్రాజ్యపాలకుని గుణములు ప్రజల కాదర్శకములై యుండవలయును. "కంచెయే చేనుమేసిన నింకఁ జేయఁ లిగిన దేమున్నది? పాపరతుఁడవును, అధర్మవర్తనుఁడవును నగు నీ వీ సామ్రాజ్యము పరిపాలింప ననర్హుండవు నీయనుచరులెప్పుడును నీయం దుండు దుర్గుణములనుగాని, దుర్వ్యర్తనముగాని బయలుపఱచరు నీను వారియెడలఁ బ్రేమకలుగుటకు నీవొనర్చెడి దానికెల్ల సంతసిం చుచుఁ దలయూచుచుందురు. చిత్రాభరణ పటస్థితిఁ బ్రకాశించు టయుఁ, జామరానిలావృతిఁ గనుటయు, మనోన్మత్తకాయంబున విజ్జి పెఁగుటయు, వాద్యధ్వనితో వెడలుటయు, దనవారి మాటవినుటయుఁ బరులదూరంబుగాఁ దరుముటయు మొదలగు గుణములు రాజునకే గాక గంగిరెద్దునకుఁగూడఁ గలవు. రాజని నంతమాత్రముననే రాజు గాఁడు. ధర్మదయాదాన గుణంబులు శరీరంబునకు భూషణంబులుగా ధరించినవాఁడే నిక్కమైన రాజన్యుఁడు. అట్టివానినే ప్రజలు గౌర వింతురు.

ఇంద్రు—నిర్లజ్జరాతీ! కాలము తప్పివచ్చినది కదాయని నీవనన్నట్లు
పలుకుచుంటివిగాని, లేకున్న నాయధర్మవర్తన మేమియున్నది

బలి—నీకుఁ జెప్పవలయునా!

ఉ. మారుని బారికోడి యభి • మానము వీడుచు గ్రామకుక్కుటా
కారముఁ దాల్చి, గౌతముని • కాంతయు సాధ్వియు నాయహల్యకుఁ
జారుఁడ వై మహాకఠిన • శాపముఁ గాంచి సహస్రయోని సం
భారము మేనఁ గాంచితివి • పాపము నీగతి జ్ఞప్తి తప్పెనే.

ఇంతకంటె ఘోరమగు పాపమేమి కావలయును. మునివధూమణుల వంచించుటకేనా సురసామ్రాజ్యమునకు నీవధిపతి వైతివి! మీ బృందారకులు రక్కసులను దుష్టచరిత్రులని నిందింతురుగాని, యిట్టి దుష్కృత్యములకు ముందుఁ ద్రోవఁ జూపిన వారు మీరే!

బృహ—(తనలో) ఈతఁడమరేంద్రుని చిత్తమునుపోటు మాటలచే నొప్పించుచున్నాఁడు. నేనేమైన నిందు జోక్యము గలిగించు కొంటినేని, నాసంగతి నెత్తునేమో! ఇఁక నాలస్యము సేయకుండ నెమ్మదిగా నావలఁ బడుటయే మంచిది.

శంబ—(బలినిజూచి) దైత్యేంద్రా! దేవేంద్రునకట్టి సుగుణము నేర్పినదీ యమరగురుఁడైన బృహస్పతి. యీసుగుణసంపత్తియం దీతనిని జెప్పి మఱియొకనిఁ జెప్పవలయును. ఈమహానుభావుని గూర్చి నీవెఱుఁగవాయేమి! అగ్రజుని భార్యతోఁ దగులుసల్పిన యాచార్యుఁడు. ఇట్టివాఁడు కావుననే నీకు జ్ఞాపకము లేదా! ఈయన భార్య తార చంద్రునితోఁ గొన్నాళ్ళు కాపురముఁ జేసి బుధునిఁ గాంచినది. విబుధలోకమంతయు వర్ణసంకరమే!

బృహ—(తనలో) ఈదురాత్ముఁడు నేనను కొన్నట్లేచేసినాఁడు (ఇంద్రునితో రహస్యముగా) మహేంద్రా! ఇంకను మనమిచ్చట నుండనేల? నెమ్మదిగా నావలకుఁ బోవుదము.

శంబ——(బృహస్పతినిజూచి) అమరాచార్యా! ఇంద్రుని చెవులుకొఱుకు చున్నావేమి !

బలి——(ఇంద్రునిఁజూచి) ఇంద్రా ! కాలచక్ర మెప్పటికెట్లు తిరుగునో యెవ్వరును జెప్పఁజాలరని నీవే వచించితివిగదా ! కాలమహిమచే నేనిప్పుడు నీసామ్రాజ్యంబు నాక్రమించితిని. ఇఁకనీవు సత్వరముగ నీనెలవునుండి వెడలుము. పొమ్ము.

ఇంద్రు——(బృహస్పతి-జయంతులతో నిష్క్రమించును.)

బలి——శంబరా ! అమరలోకము మనకు నాయాసములేకుండ స్వాధీనమైనది (ఇంచుకయూరకుండి) నేనియ్యెడకు వచ్చునప్పుడు మనగురుండైన శుక్రాచార్యుని సత్వరముగరమ్మని వేడితిని అమ్మహానుభావుఁ డింతవఱకును రాకయుండుట కేమికారణమో ?

శంబ——(ఎదుటఁ జూచి) అదిగో ఆచార్యుఁడు వచ్చుచున్నాఁడు.

(శుక్రాచార్యులు ప్రవేశించును)

బలి — పీఠమునుండిలేచి) ఆచార్యోత్తమా ! నావందనములందుకొనుము. (శుక్రునిపాదములకు నమస్కరించును)

శుక్రా——అమరలోక సామ్రాజ్యపీఠ మధిష్ఠించిన దానవచక్రవర్తికి జయంబగును గాక ! (ఆసీనుఁడగును)

బలి——మహాత్మా ! భార్గవా ! నీయమూల్య కరుణావిశేషమునఁగదా నేనీమహోన్నత దివ్యపదవి నందఁగలిగితిని. నీఋణము నేను సహస్ర జన్మములకైనను దీర్పఁజాలను.

శుక్రా——వైరోచనా ! సద్యశోలతలు దిగంతములఁ బ్రాకించుచు, సామ్రాజ్యాభివృద్ధిఁగోరుచు, సభియాతివ్యూహవిజ్ఞాత సర్వాశోత్కృష్ట విజయుఁడవై, సామంతమండలి భవదాజ్ఞావశవర్తులాగతిని నీ రాజ్యేందిర నేలుకొనుము. మహాత్ములై కుటిలు

బన్న రాజద్రోహిమండలమునకు గుండెదిగులై, ఆశ్రయించిన దీనకోటికి దంగేటిజున్నై, అధర్మమార్గము పరిత్యజించి మేలుగ నోరు సుగుణశీలుర కలుజేతి వెన్నయై, రాజ్యమునకుఁ జేటుఁ గూర్పఁదలఁచు దురాత్ములపాలి ధూమకేతువై నీపరిపాలనము వర్ధిల్లుఁగాక ! ఆయురారోగ్య సకలైశ్వర్యములును, జయసన్మానోన్నతులును, స్వజనానంద ప్రశస్తశీలమును, సామ్రాజ్య రక్షణోద్యోగశక్తియు, సత్యవాక ప్రతిష్ఠాపనామతియు, దండ శాసన గుణార్జవమును, వైరినిర్ధళనవ్యాపారరతియు, నీయందు నిలచుఁగాక ! భవత్పరిపాలనా వైభవము సత్కవిపుంగవుల నిర్మలవాణిచేఁగీర్తింపఁబడుఁగాక!

(తెరలో కలకలము)

శంబ—(చూచి) కాలనాభుడు రంభనుగాఁబోలు తోడ్కొని వచ్చుచున్నాఁడు.

(కాలనాభుఁడు-రంభతోఁబ్రవేశించును)

కాల—(రంభనుజూచి) ఓసీ ! దానవచక్రవర్తి సన్నిధికి నడువుము. నీకులుకులు, నీత్రిప్పులు, నడకలు, దొంగచూపులు, రాక్షసుల యొద్దఁబనికిరావు పద (సమీపించుచున్నాఁడు)

రంభ—నేను వచ్చుచుంటిని, నన్నుముట్టకుము.

కాల—నీశరీరమునకు నాహస్తము తగిలినయెడల నీపాతివ్రత్యమునకు భంగము కలుగునాయేమి ! పాపము!

రంభ—(తనలో) కమలాల యాకృత్యము లతివిచిత్రములు. ఆమెకటాక్షమున్నచో నిర్ధనుఁడు సప్తద్వీపసముద్రముద్రితమహీచక్రంబుఁ బరిపాలించు చక్రవర్తియగును. ఆమె కటాక్షము తప్పినచోఁ జక్రవర్తి నిరుపేదయగును.

కాల—(బలింజూచి) దానవేంద్రా! దేవవేశ్యయగు నీరంభ, మన మరుదెంచి దేవతాలోకము నాక్రమించితిమని యెక్కడికో కాలికి బుద్ధిఁజెప్పచుండఁగాఁ బట్టుకొని నీసన్నిధికిఁ దోడ్కొని వచ్చితిని.

శంబ—భూలోకమున సమస్త క్షత్రియవీరులగు బ్రాహ్మణులు యజ్ఞములు సేయుట యీరంభ నిమిత్తమే యని వినియుంటిని.

బలి—(శుక్రాచార్యునిఁజూచి) ఆచార్యా! మోక్షమునాశించిగాని, భాగ్యముకొఱకుఁగాని, లేక మఱియే యభీష్టమునకైనఁగాని భగవత్ప్రీతికై యజ్ఞములు సేయుదురుగాని, ఈరంభనిమిత్తమా యజ్ఞములు చేయుట! తుచ్ఛమగు నిట్టిభోగమునకా! (రంభను జూచి) ఓవారనారీమణీ! నీవు మమ్ములఁగూర్చి యేమంతయు భయంబందవలదు. ఈ బలిచక్రవర్తి మీ మహేంద్రునివలె దుష్టప్రవర్తనుఁడని సంశయింపవలదు. నేనీ దేవలోకము నాక్రమించితినని యబలవగు నీవెచ్చటకును బోవనవసరములేదు. దేవతా మహోత్సవములయందును, నే నొనర్చుక్రతువులయందును, నాసభాస్థానంబునందును నీనృత్యగానాభినయంబుల బ్రకటించుచుండుము. పొమ్ము.

రంభ—దానవలోక సార్వభౌముని యాజ్ఞశిరంబున ధరించుచున్నాను.

(నిష్క్రమించును)

బలి—(శంబరునిఁజూచి) శంబరా! నేఁడు మొదలు మనరక్కసు లెవ్వరును నధర్మకార్యముల సేయరాదు. సుజనుల హింసించుట పరాంగనలఁబట్టుట, మునులను వేధించుట, మొదలగు దుష్టకార్యము లెవ్వరును సేయరాదని నాశాసనముగాఁ దెలుపుము.

శాసనోల్లంఘన మాచరించువారు కఠినముగా శిక్షింపఁబడుదురు. ఇంతకుముందు మనదైత్యులధర్మపరులై యుండుటచేతనే నాశమందిరి. (శుక్రాచార్యునిజూచి) ఆచార్యా! ఇఁక మనుమరుగుదమా!

శుక్రా—నాకును వేళయైనది. రమ్ము.

(అందఱును నిష్క్రమించుచున్నారు)





# —: ద్వితీయాంకము :—

రంగము—కశ్యపాశ్రమము—కశ్యపుని శిష్యుఁడైన

గాలవుఁడు—ప్రవేశము.

గాలవుఁడు—(తనలో) గురుండగు కశ్యపుఁడు మహాకరుణా సాగరుఁడు కదా! నాయెడల వాత్సల్యముఁ బూని ఋగ్యజుస్సామ వేదవ్రజమును, దర్శనహాస్యములును, నానాదభాష్యమీమాంసలును, మహాషడంగములును, నెఱింగించెను. విజ్ఞాన మర్మంబు వినిపించెను. మంత్రశాస్త్ర సమితి నొడివెను. సకల పురాణంబులను నాకళింపొనరించెను. లక్షణ విధములను బోధించెను. వైద్యాగమము సమగ్రముగఁ దేలపఱచెను. ఆహా? ఇట్టి గురువులయొద్ద విద్యాభ్యాసముఁ గావించు శిష్యుల కేమియుఁ గొఱఁత యుండదుకదా?

(జాబాలి—ప్రవేశించుచు)

జాబా—(గాలవునిఁజూచి) ఏమిరా! గాలవా! ఏమిచేయుచున్నావు? ఎప్పుడు చూచినను నేదియో యాలోచనయే సేయుచుందువు' కొంచెము సేపైనను మనస్సునకు విశ్రాంతి యొసంగవుకదా! చేతిలో పుస్తకమును వదలవు.

గాల—మిత్రుఁడా ! స్వగ్రామము విడిచి మనమింత దూరమువచ్చిన దెందులకు ? ఈ మహానుభావుఁడగు కశ్యపు నాశ్రయించి విద్యలఁ గఱచుట కేకదా !

జాబా—నీకేమి ! నీవు సకల విద్యా పరిపూర్ణుఁడ వైతివి. నాపనియే వలయాకారముగ నున్నది. ఏశాస్త్రము పూర్తికాలేదు.

గాల—నీకు విద్యయందు విశేష శ్రద్ధలేదు.

జాబా—అదిగో ! ఆమాటయే పలుకవలదని చెప్పినాను. అందులకు నేను సమ్మతింపను. శ్రద్ధ కేమియు లోపములేదు. బుద్ధికే లోపము. అందఱికంటె నాయొద్దనొక గొప్ప తెలివియున్నది. పాఠము గ్రంథము చూడఁగనే వచ్చును. తరువాత గురువుగారు చెప్ప మన్నప్పుడు—కడుపులో ప్రవేశించిన విషయములు మరల నీవలకు రావు.

గాల—ఈమాటలకేమిగాని నీవు గ్రంథముఁబట్టి తదేకదృష్టితోఁ బఠించినచో నీవు కృతార్థుఁడవు కాఁగలవు.

జాబా—పుస్తకముపైఁ దదేక దృష్టి యుంచియే యుందును. కాని, మనస్సు మాత్రము దానిపైనుండదు. లోకసంచారము చేయుచుండును.

గాల—నీవు నామాటవిని కొన్నాళ్ళు "సారస్వత రసాయనము" పుచ్చుకొనుము, మేధాసిధి వయ్యెదవు.

జాబా—వద్దు, వద్దు—కొండనాలుకకు మందు పుచ్చుకొనిన పెద్ద నాలుక యూడినట్లవుతుంది. నీవు చెప్పినది పుచ్చుకొన్నచో బుద్ధి వృద్ధికాదు కాని కడుపులో పసరుమాత్రము పూర్తిగా పెరుగును. దానికి తెల్లతెగడ ప్రయోగించవలెను. ఈయవస్థ లెందుకు ? లోకములో అందఱును పండితులేయున్నారా ?

గాల—గురువుగారు వచ్చుచున్నారు. మాటలాడకుము.

జాబా—గ్రంథ పఠనము చేయుచున్నట్లుండ వలెను.

(కశ్యపుఁడు—ప్రవేశించును)

గాల } జాబా } గురువర్యా! వందనములు.

కశ్య—(గాలవునిఁజూచి) గాలవా! ఈ జాబాలియేమి చదువుచున్నాడు.

జాబా—ఏమియు లోపములేదు. అన్నియుఁ జదువుచున్నాను.

కశ్య—ఏవి! నిన్న నేను చెప్పిన "నిత్యాయ త్రిగుణాత్మనే" అను శ్లోకమును "నిత్యస్వోదర పూరణాయ" అను శ్లోకమును చదివి వానియర్థముఁ జెప్పుము.

జాబా—అయ్యా! గ్రంథము చూచి చదువనా!

కశ్య—చూడకుండఁ జదువలేవా!

జాబా—చదువఁ గలుగుదునుగాని నేను చదువు నాలుగు పాదములును శాస్త్రప్రకార మొకపాదమే యగునని కొంచెము సంశయము.

కశ్య—అట్లయిన—గాలవా! నీవు వానిని జదువుము. వీఁడర్థముఁ జెప్పును.

జాబా—అర్థమున కిబ్బంది లేదు.

గాల—

శ్లో. నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీశ్రేయసే
సత్యాయాది కుటుంబినే మునిమనః ప్రత్యక్ష చిన్మూర్తయే
మాయాసృష్ట జగత్త్రయాయ సకలామ్నాయాంతసంచారిణే
సాయంతాండవ సంభ్రమాయ జటినే సేయంనతిశ్శంభవే.

శ్లో. నిత్యంస్వోదర పూరణాయ సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థంపర్యటనంకరోమి భవతస్సేవాం నజానేవిభో
మజ్జన్మాంతర పుణ్యపాపబలత స్త్వం శర్వ సర్వాంతర
స్తిష్ఠస్యేన హి తేనవా పశుపతే తేరక్షణీయోస్మ్యహమ్.

కశ్య—జాబాలీ! మొదటి శ్లోకమునకు నీవర్థముఁ జెప్పుము.

జాబా—స్వామీ! ప్రతిపదార్థమా? లేక తాత్పర్యముఁ జెప్పమందురా!

కశ్య—అనవసర సంభాషణముతో నీవు వృథా కాలయాపనము సేయకుము.

జాబా—మహాత్మా? బాల్యమున మాతల్లి నాకు వస విశేషముగా నూరిపోయుటచే నిట్టి వాగ్ధాటి కలిగినది. కాని, ఇది విద్యకుఁ బనికి వచ్చుటలేదు.

గాల—జాబాలీ! శ్లోకార్థము చెప్పుమని గురువుగా రడిగిరి. ఈమాట లన్నియు నెందులకు? త్వరగా కానిమ్ము.

జాబా—ఇదిగో! ఎంతసేపు. (కశ్యపునిఁ జూచి) దేవా! సావధాన చిత్తులై వినుఁడు. ఆశ్లోకమునకు అర్థమేమనఁగా! నిత్యమును, మూడు గుణములు. అనఁగా కామ, క్రోధ మోహములు గలిగి పురజితే అనగా పురములను జయించుచు-గూఢార్థము. దారులను గొట్టుచూ - శ్రేయము కొఱకు - గంగానమ్మను ఇక్కడ - కాత్యాయని - అనగా ఆదేవత కర్థము. సిత్యా యాది కుటుంబినే - అని యున్నది- అంటే - పెద్దయింటివాళ్ళు అందులో జన్మించిన దేవత? వాల్మీకి - ఆవాల్మీకికి యీ శ్లోకములో "ముని" అని ప్రయోగించినాడు. పైనఁజెప్పిన దంతయు నాముని మనస్సునందు ప్రత్యక్షమైనదన్న మాట-ఆవాల్మీకి

దారులు కొట్టడానికి సాయంసమయమున జుట్టువిరబోసికొని శంభునివలె గంతులు వేయును. ఈవాక్యము. "సాయంతాండవసంభ్రమా యజటి నేసేయం సతిశ్శంభవే'' అన్నదానికర్థము.

కశ్య—ఓరీ! నీ తెలివి తెల్లవార! ఏమి అర్థమురా! ఇంత మందమతి వేమి?

గాల—(నవ్వుచున్నాడు)

జాబా—మహాత్మా! ఇంక నాకీ విద్య వలన లాభములేదు గాని, ఆశుకవిత్వము - చెప్పుట నేర్పుదురా? అదివస్తే "మంచివాఁడవు నీవయ్యా మల్లిసెట్టి'' అని చెప్పుచు బయలుదేరినచో లాభముండును - (ఇంచుక యూరకుండి) అదికాదు! ఆశుకవిత్వంలో పటుత్వంలేక పోతే అందఱును దూషింతురు. కావున భూత వైద్యము నేర్పుడు. కొంచెము విభూతిబెట్టుచుఁ బొట్టఁబోసికొందును.

(అదితి ప్రవేశము)

అదితి—(తనలో) ఇదిగో! తపః ప్రభావ సంపన్నుఁడగు మన్నాథుఁడు శిష్య సహితుఁడై యాశ్రమమునందే యున్నాఁడు. పోయి దర్శించెదఁగాక! (కశ్యపుని సమీపించి) ప్రాణేశ్వరా! నీ చరణసరోరుహంబులకీ సేవకురాలు నమస్కరించు చున్నది (నమస్కరించును)

కశ్య—(ఆశ్చర్యముతో) కల్యాణీ! ఎచ్చటనుండి నీరాక!

అది—దేవా! నాయవస్థ నేమని విన్నవింతును.

కశ్య—నీరాక నాకెంతయు నద్భుతముఁ గొలుపుచున్నది. గజగవయ గండభేరుండగండకకంఠీరవవ్యాఘ్రశరభసైరిభ మహాజంతు సంతానాకుంఠితకంఠకుహరవినిర్గతక్రూరనిర్ఘోషభీషణంబును,పిశా

చగణవిహారాడంబరదంతురంబును, జంబుజంబీరనింబతరుస్యందన మందారకందరాలపలాశన్యగ్రోధాశ్వత్థాదివసుధారుహపటలాభ్రంకషంబును, నిశాతస్థూలకంటకపాషాణశ్రేణీవ్యావృతంబును, కలరవఖంజరీటశ్యేనచటకాలకంఠప్రముఖనిఖిలఖగకులధ్వానసంకులంబును నై యొప్పుచు దినేశరుచులు జొరనీక, చీకటులు గ్రమ్ముకొని యిసుకఁ జల్లినఁ రాలకుండ బరిక, చిట్రేగు, గచ్చ, కసింద, కోరింద కంపల గలయం బెనుచుకొని, తెరవరయ వశంబుగానీక యల్లికలఁ బెల్లుకటంబై దురవగాహస్థితి నతిశయిల్లు మహారణ్యం బెట్లు గడచివచ్చితివి?

గాల—(జాబాలిని జూచి రహస్యముగా) ఈమె మన గురువుగారి భార్యయైనది యదితిదేవి. అమరమాత.

జాబా—ఈమె మనకు పూజ్యురాలు. నమస్కరింపవలయును.

(గాలవుఁడును జాబాలియు నదితికి నమస్కరింతురు.)

అది—(కశ్యపునిఁ జూచి) నాథా! పరితాపముచేఁ బీడింపఁబడుచుండు దేహము గట్టులను, పుట్టలను, భయబాటవులను లెక్కపెట్టదు.

కశ్య—మహా తపఃప్రభావసంపన్నుఁడగు శ్రీకశ్యపునకు భార్యవైన నీకు; త్రిభువనాధీశ్వరుండైన మహేంద్రునకు మాతవైన నీకు; పరితాపంబునకుఁ గారణమేమి?

మ. తెలుపవా! విప్రులు పూర్ణులై జరుగునే ♦ దేవార్చనాచారముల్
తతితో వేలుతురే గృహస్థులు సుతుల్ ♦ ధర్మానుసంధానులే
నెఱి నభ్యాగతకోటికన్న మిడుదే ♦ నీరంబునుం బోయుదే
మఱలే కర్షుల దానులన్ సుజనులన్ ♦ మన్నింపుదే పైదలీ.

ఆ. అన్నమైనఁ దక్క ♦ నైనఁ దోయంబైన
శాకమైనఁ దినకు ♦ జరగుకాలఁడి

నతిథి జనులకడ్డ ♦ మాడకయుడ రేని
లేమ వారు కలిగి ♦ లేనివారు.

రమణీ! శ్రీమన్నారాయణునకు భూమీసురు లన్నఁ బ్రీతి మెక్కువ. బ్రాహ్మణులను పూజించు పుణ్యాత్ములా మహాత్మునకుఁ బరమభక్తులు. బ్రాహ్మణులు సంతుష్టిఁ బొందిరేని యాదేవదేవుఁడు సంతుష్టిఁ బొందును. నీవు బ్రాహ్మణులను పూజించుచుందువుగదా! పాకశాసనునకు భద్రమేగదా! తత్సతీమణియు, మహాసాధ్వియు నగు శచి నీయందు భక్తిఁ బూని వర్తించును గదా! జయంతకుమారుఁడు కుశలియే!

అది—అందఱును గుశలముగ నున్నారు.

కశ్య—అట్లయిన నీకుఁ బరితాపమునకుఁ గారణమేమి?

అది—దేవా! ఏమని చెప్పుదును! క్షీరసాగర మథనసమయమున మహేంద్రునిచే నోడింపఁబడి, తనవారితోఁ బశ్చిమశిఖరి శిఖరంబుఁ జేరిన బలి, శుక్రాచార్యానుమతంబున విశ్వజిద్యాగంబుఁ గావించి, భుజబలపరాక్రమంబున గర్వించి, యమరావతి నాక్రమించినాఁడు.

సీ. ఎండకన్నెఱుగని ♦ యింద్రుని యిల్లాలు
వలువంచలను జాలిఁ ♦ బడియె నేఁడు
త్రిభువన సామ్రాజ్య ♦ విభవంబుఁ గోల్పోయి
దేవేంద్రుఁ డడవుల ♦ దిరిగె నేఁడు
గలిమిగారాబు బిడ్డలు జయంతాదులు
శబరార్భకులవెంటఁ ♦ జనిరి నేఁడు
సమరుల కాధార ♦ మగు నమరావతి
యసురుల కాటప ♦ ట్టయ్యె నేఁడు

ఆ. బలి జగములనెల్ల ♦ బలియుచునున్నాఁడు
వాని గెలువరాదు ♦ వాసవునకు
యాగభాగమెల్ల ♦ నతఁడాహరించును
గడఁగిసురలకొక్క ♦ కడియునీఁడు.

సీ. అడుగేనిఁ బెట్ట శ♦క్యముగాని భీకరా
రణ్యముల్ మసలుచుండి ♦ రంబులయ్యొ
కడుభీతిఁ గలిగించు ♦ కాననమృగములు
ఘనపరిచారికా ♦ జనములైరి
కడుపునిండను ద్రావు ♦ కొలగజలంబులు
సరసభక్ష్యాన్నర♦సంబులయ్యె
కఠినశిలాయుక్త ♦ కంటక భూములే
బహుసౌఖ్యమిచ్చు త♦ల్పంబులయ్యె

తే. కటకటా యెట్టి ఘోరసం♦కటముగలిగె
నమరనాథున కబ్బలి ♦ యమరపురిని
గార్యమున నాక్రమించిన ♦ కారణమున
భావమునఁ జేర్పవే దీని ♦ నీవు నాథ.

మ. కకుబంతాధిప దివ్యరత్న మకుటా ♦ గ్రస్థాపనీభూత బీ
తికరోద్దీపిత శాసనుండయిన యా ♦ దేవేంద్రుఁడట్టుల్ శచీ
చకితాక్షీమణిఁ గూడి కానల నవ ♦ స్థల్ బొందఁగానయ్యె నీ
వికనేరీతిని వారల మనుపఁ బ్రా♦ణేశా! మదికి జూచెదో.

అమరేంద్రుఁ డాలుబిడ్డలతోఁ బడుచున్న దుర్భరకష్టంబులను నేను చూడఁజాలక యున్నాను.

సీ. ధన్యసంప్రాప్తసు ♦ ధర్మసింహాసనా
స్థానభాగ్యగరిమ ♦ సన్నగిల్లె

నవకల్పభాసిత ♦ నందనానందని
ర్భలవిహారసుఖంబు ♦ సమసిపోయె
రమణీయనిర్మల ♦ ప్రతిభాధురీణ ది
క్పాల సంసేవలు ♦ నేలఁగలిసె
ఐరావతోచ్చైశ్శ్ర ♦ వస్సద్వాహన
స్వర్గసంచారముల్ ♦ జలధిఁబడియె

తే. దివ్యచింతామణీకామ ♦ ధేనుపారి
జాత విభవముల్ దివ్యప్ర ♦ పంతిడాగె
పటుపరాక్రమ విక్రమ ♦ ప్రాభవంబు
బలిని మాయచే లోలోన ♦ నడఁగియుండె.

కశ్య—సతీమణీ! తపోవృత్తినున్న నన్నింకను ఇట్టి చింత లిప్పుడప్పుడు బాధించుచునే యున్నవి. విధికృతము నెవ్వరును దప్పింపఁ జాలరు.

అది—దేవా! అట్లని యూరకుండఁగలనా!

మ. సురలన్ సభ్యుల నార్తులన్ విరధులన్ ♦ శోకంబు వారించి ని
ర్జరధానిన్ నిలుపంగ రాత్రించరులన్ ♦ శాసింప సత్కార్యమీ
వెరవేరీతి ఘటిల్లు నట్టి క్రమముల్ ♦ వేగంబ చింతింపవే
కరుణాలోక సుధాఝరిం దనుపవే ♦ కల్యాణ సంధాయకా.

నీవు తలంచుకొన్నచో నెట్టి కార్యమునైనను సేయఁగలవు. మహాతపస్సంపన్నుఁడవగు నీకు శక్యముగాని దేమున్నది?

మ. జనకుండెవ్వఁడు జాతుఁడెవ్వఁడు జన ♦ స్థానంబు లెచ్చోటు సం
జననంబెయ్యది మేను లేకొందిది సం ♦ సారంబు లేరూపముల్

వినుమా యింతయు విష్ణుమాయఁ దలఁపన్ వేఱేమియున్ లేదు మా
హానిబంధంబు నిధానమింతటికి జాయా విన్నఁబో నేటికిన్.

అయినను నిందులకుఁ గర్తవ్యము వక్కాణించెదను.

మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపా పారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరిసేవ సేయుమతఁడున్ సాంగత్యముం బొంది నీ
కగు నిష్టార్థములెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి సేకూరెడిన్
భగత్సేవం బొందరాదె బహు సౌభాగ్యంబులం బ్రేయసీ.

ఇప్పట్టున నీపరితాప దవానలం బార్పఁగలిగినవాఁడు భగవంతుఁడగు శ్రీమన్నారాయణుఁడే. నీ వాతనిని సేవింపుము. నీయెడలఁ బ్రసన్నుఁడగును.

అదితి—పరమనిష్ఠాగరిష్ఠత్వమున ఘోరకాననంబులయందుఁ బెక్కు సంవత్సరములు తపంబొనర్చు మహాయోగులకే యద్దేవుఁడు ప్రసన్నుఁడగుట కష్టమని విందును. అట్టిచో—అబల—జ్ఞానహీననై—అగు నాకాతఁ డెట్లు ప్రసన్నుఁడై—పరితాపము వాపును ?

కశ్య—శ్రీమన్నారాయణుఁ డార్తత్రాణ పారీణుఁడు భక్తపరతంత్రుఁడు కరుణాసముద్రుఁడు. నీ వామహాత్మునిఁ సేవించుటకుఁ దగిన మార్గము జెప్పెదను. పయోభక్షణంబను నొకవ్రతంబున్నది. హరిసమర్పణంబుగా నీవావ్రతమును పండ్రెండు దినములు సేయవలయును. ఆమంత్రింబునుఁ దద్విధానమును, దదుపవాస దాన భోజన పరికారంబులను నెఱింగించెదను. రమ్ము.

(కశ్యపుఁడును అదితియు నిష్క్రమింతురు.)

జాబా—ఇఁక మనము గూడఁ బోయి భోజనము సంగతిఁ జూచుకొందము. భోజనము చేసిన తరువాత వనములోనికిఁ బోయి

కొంచెపు నేవు అశోకవృక్షము క్రింద విశ్రమించవలెను. అదితి దేవి వచ్చుట నాకుఁ జాల యానందముగ నున్నది.

గాల—ఎందుచేత,

జా.బా—ఏమన్నది? అమరలోకమును అసురలు ఆక్రమించిరని చెప్పుటకుఁ గదా ఈమె వచ్చినది. ఆమె కేదో యొక దారి జూపినఁగాని, గురువుగారు మన పాఠములను సరిగాఁ జూడరు.

గాల—అందుకనియా నీకానందము. సరేలే. రా!

(నిష్క్రమింతురు)

రంగము—(వనము తపస్సునందుండు అదితి ప్రవేశము)

అది—(తనలో) నేడే నావ్రత సమాప్తి దినము. జగదీశ్వరుండగు శ్రీహరి యికఁ నాయెడల నెట్లు కృపఁ బూనునో! (కన్నులు మూసికొని) సకలామరశిరోమకుటరత్నప్రభాభాసమానపద పంకేరుహా? సంసారార్ణవకర్ణధారా! లక్ష్మీనయనోత్పలపూర్ణ చంద్రా! ప్రావృడ్ఘన శ్యామలా! శ్రీమన్నారాయణా!

(విష్ణుమూర్తి ప్రవేశించుచున్నాఁడు)

విష్ణు—(తనలో) ఈమె నాకరుణ నాశించి కఠిన నియమముతో నన్ను గొల్చుచున్నది. నేనికఁ నీమెకు బ్రసన్నుఁడ నయ్యెదఁగాక. (సమీపించి) అమరమాతా! అదితీ!

అది—(కన్నులు తెఱచి చూచి లేచి-తనలో) ఆహా! నాభాగ్యము. (శ్రీహరిపాదములకు నమస్కరించి) సకల భూతంబులకు నంత ర్యామివైన నీకు నమస్కరించుచున్నాను. కల్పాంతసమయ మందు నఖిల ప్రపంచము నాహరించి శేషపర్యంక తలమున యోగనిద్రారతినుండి, నాభికమలము నుండి చతుర్ముఖుని బుట్టించిన యాది దేవుఁడవగు నీకుఁబ్రణతులర్పించుచున్నాను.

దేవా! నిన్నుఁ దమ హృదయ పీఠంబులయందుఁ బాదుకొల్పి తమసర్వస్వము నీకర్పించి యనేకులు కృతార్థులగు చుండిరి. శరణాగత త్రాణ బిరుదాంకితుఁడ వగు నీవును వారి చిత్తముల యందు వసించుచు వారి కామ్యములఁ దీర్చుచుందువు. జగన్నాయకా! కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను జయించి, షట్కర్మనిరతులై పురనగర గ్రామంబులఁ బరిత్యజించి పర్వతారణ్యముల సంచరించుచు, శరీరధారణార్థము, స్వల్ప భోజనులై మోదఖేదంబులు సమముగ భావించి, నిర్జితేంద్రియులై పవిత్రాంతఃకరణులైన యోగీశ్వరులు గూడ నొక్కొక్క సమయమున నీమహిమ నెఱుఁగఁజాలరు. భవన్నామ సంకీర్తనము జగన్మంగళము. జగన్మోహనము. జగజ్జేగీయమానము. నిఖిలపాపైక నిష్కృతి-సకలదుఃఖనివారణము-దారిద్ర్యవిచ్ఛేదకము- ఓలక్ష్మీకళత్రా! పరితాప వార్ధియందు మునింగిన నేను-పద్మాంకుశచాప చక్రమత్స్యరేఖాలంకృతమైన నీపదములను-సనకాది యోగీంద్ర హృదయ సంస్థాపితమైన నీపదములను-శృతివధూ సీమంతవీథులఁ జెన్ను మీఁగులు నీపదములను, సమస్తకలుషవిధంగయగు గంగాభవానికిజన్మస్థలంబైన నీపదములను, ముక్తికాంతామనోమోహనమైననీపదములను, బ్రహ్మేంద్రాది బృందారకప్రముఖ కిరీటరత్నరుచిదీపితములగు నీపదములను, ఆశ్రయించితిని. యోగీంద్రులకైనను దుర్లభమైన భవదీయ దివ్యమంగళ విగ్రహసందర్శనము మదీయ పూర్వపుణ్యవశమున లభించినది. దేవా! రక్షింపుము.

విష్ణు—సాధ్వీమణీ! అదితీ! నీయభీష్టము నేనెఱుంగుదును. ఇప్పుడు బలి దేవధానినధిష్ఠించి, విశ్వవిజయుఁడై రాజ్యము బాలించుచున్నాఁడు.

ఆతఁడు సత్యసంధుఁడు. ధర్మపథానువర్తి. అనేకాశ్వమేధంబులు గావించినాడు.

శా. అర్థుల్ వేడరు దాతలుండెడరు స ♦ త్త్రారంభముల్ పండు ప్రత్యర్థుల్ లేరు, మహోత్సవంబులను దే ♦ వాగారముల్ వొల్చుఁ బూర్ణార్థుల్ విప్రులు, వర్షముల్ గురియు గా ♦ లార్హంబులై ధాత్రికిన్ సార్థంబయ్యె వసుంధరాత్వమసురేం ♦ ద్రాధీశురాజ్యంబునన్.

సద్గుణవర్తనుఁడగు నా బలి నెట్లు వంచింపఁగలను? ఆతని రాజ్యశ్రీ నెట్లు హరించి మహేంద్రునకుఁ గూర్తును ?

అది—

సీ. యజ్ఞేశ విశ్వంభ ♦ రాచ్యుత శ్రీరమణమం
గళనామధేయ, లో ♦ కస్వరూప
యాపన్నభక్తజ ♦ నార్తివిఖండన
దీనలోకాధార ♦ తీర్థపాద
విశ్వోద్భవస్థితి ♦ విలయకారణ భూత
సంతతానంద శ ♦ శ్వద్విలాస
యా[illegible]హంబు ♦ ననుపమలక్ష్మియు
వసుధయు దివము ది ♦ వర్గములును

తే. వైదికజ్ఞానమును ముక్తి ♦ వైరిజయము
నిన్నుఁ గొలువని నరులకు ♦ నెఱయఁ గలదె
వినుతమందార గుణహార ♦ వేదసార
ప్రణతవత్సల పద్మాక్ష ♦ పరమపురుష.

ఆ. అసురవరులు సురల ♦ నదలించి బెదరించి
నాకమేలుచున్న ♦ నాట[illegible]ంచి

కన్నకడుపుగాన ♦ కంటఁగూరుకురాదు
కడుపుబొక్కు మాన్పి ♦ కావవయ్య.

(శ్రీహరి పానముల పైఁబడును)

విష్ణు.—అదితీ! లెమ్ము. లెమ్ము. (ఇంచుకయాలోచించి)నీవువిచారింపకుము. కృతార్థురాలవు కాఁగలవు.

శా. నీకోడండ్రును నీకుమారవరులున్ ♦ నీనాథుఁడున్నీవు సం
శ్లోకింపన్ సతులుంబతుల్ మిగులన ♦ మ్మోదింపరాతిం చరుల్
శోకింపన్ భవదీయగర్భమున ♦ జోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుకపుట్టనీసుతుఁడనై ♦ వర్తించివర్తింపఁగాన్.

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయో ♦ పాయంబునంగాని సం
చలనం బొందకు నేను నీనియతికిన్ ♦ సద్భక్తికిన్ మెచ్చితిన్
బలివిద్వేషణుడున్ నిలింపగణముం ♦ బౌలోమియున్ మెచ్చదై
త్యుల రాజ్యంబు హరింతు నిందునికిని ♦ త్తున్ దుఃఖమిం కేటికిన్.

నారూపమును మానసించి నీవు నీరమణుని సేవింపుచుండుము. నేను నీకు నందనుఁడనై దానవుల భాగ్యశ్రీల హరించి, మహేంద్రునిచే నమరావతిని నేలింతును.

(అదృశ్యుఁడగును)

అదితి—(సంతోషముతో) నేనోనర్చిన వ్రతము ఫలించినది. అఖిల జగన్నియామకుఁ డగు శ్రీమన్నారాయణుఁడు నాగర్భాగారంబును ప్రవేశింతునని పలుకుట నాపూర్వపుణ్యము కదా! నేనిప్పటికిఁ గృతార్థురాలనయితిని. ఇక నీశుభవార్తఁ ప్రాణేశ్వరునకెఱిఁగింప డెందము తొందరపడుచున్నది.

(నిష్క్రమించును.)

(రంగము—(వనము-గాలవుఁడు ప్రవేశించును.)

గాల—(తనలో) ఆహా!

సీ. ఇంద్రనీలచ్ఛాయ ♦ నేలు దేహంబుపైఁ
గనకచేలపరిధిఁ ♦ గాలువాఁడు
వజ్రపంజరనిభం ♦ బైన వక్షంబున
వైజయంతీమాల ♦ వరలువాఁడు
పాదసన్నిధియందు ♦ భక్తినాసీనయౌ
శ్రీదేవిసేవలఁ ♦ జెందువాఁడు
సాధురక్షణములో ♦ చక్కనికరముల
వరశంఖచక్రముల్ ♦ బట్టువాఁడు

తే. శేషపర్యంకమున విల ♦ సిల్లువాఁడు
నాదమధ్యాంతరహితుఁడై ♦ యలరువాఁడు
సకలభువనములకుఁ గర్త ♦ యైనవాఁడు
నదితి కేళికిఁ దనయుఁడై ♦ యలరినాఁడు

అదితి కశ్యపుల భాగ్యమే భాగ్యము! సాక్షాద్రమానాథుని నందనుఁ సిగాఁ బడయుట కదితి పూర్వజన్మంబున నెట్టిసుకృతము జేసెనో కదా! (ఇంచుక యూరకుండి) మఱచితిని. నేనిచ్చట నాలస్యము సేయ రాదు. భగవత్పూజార్థము పుష్పంబులఁ దెమ్మని గురుఁడు నన్ను నియమించినాఁడు కావున సత్వరముగ బోవలయును. (కొంచెము నడిచి పుష్పములఁ గోయుచున్నది.)

జాబాలి—(ప్రవేశించి తనలో) గురుసన్నిధిఁ బాసి పెక్కు దినంబులయ్యెను. నాసహపాఠియగు గాలవుఁ డిచ్చట నుండెనో లేదో! (ఎదుట జూఁచి) ఇదిగో! గాలవుఁడిచ్చటనే ప్రత్యక్షమైనాఁడు. (గాలవునిజూచి) మిత్రుఁడా!

గాల—మిత్రుఁడా! ఎప్పుడు వచ్చితివి?

జాబా—ఇప్పు డేవచ్చుచున్నాను.

గాల—ఇంటియొద్దనే యున్నా వెల్ల? ఆలస్యము చేసితివేమి? గురుఁడు నిన్నుఁ దలంపని దినమే లేదు.

జాబా—త్వరలో రావలయుననియే యరిగితిని. కార్యాంతరములచే నాలస్యమైనది. ఇంటికి వెళ్ళునప్పటికి నాకు వివాహసంబంధములు వచ్చినవి. విద్యాభ్యాసము పూర్తియైనఁగాని వివాహము చేసికొననని చెప్పినాను కాని నా తలిదండ్రులు బలవంతపెట్టుటచేతను, వెదకకుండా లభించిన సంబంధమగుటచేతను, సమ్మతించితిని. ముందు సంవత్సరములోఁగాని పెండ్లిజేసికొనన్ని చెప్పినాను. తాంబూలములు పుచ్చుకొనుట జరిగినది. (ఇంచుక యూరకుండి) ఈసంగతులేకేమి గాని యాశ్రమమున విశేషము లేమి?

గాల—గొప్పవిశేషములే యున్నవి. నడచుచుఁ గాని యన్ని యుఁ జెప్పెదను. రా! పోదము.

జాబా—(ఆతురతతో) ఆవిశేషము లేవో చెప్పుము. వినుటకు చిత్తము తొందరపడుచున్నది.

గాల—

మ. రవిమధ్యాహ్నమునంజరింపగ్రహతా ♦ రాచంద్రభద్రస్థితిన
శ్రవణద్వాదశినాఁడు శ్రోణనభిజి ♦ త్సంజ్ఞాతలగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం ♦ బుణ్యవ్రతో పేతకున్
దివిజాధీశ్వరుమాతకుం బరమపా ♦ తివ్రత్య విఖ్యాతకున్.

జాబా—ఆహా! శ్రీమన్నారాయణుఁడు వామనుఁడై యదితి గర్భంబున జన్మించెనా! మాగురువుగారి భాగ్యము కదా! ఆసమయమున నిచ్చటికి సకల మునీంద్రులును వచ్చియుందురు.

గాల——మునీంద్రులేనా! పార్వతీ పరమేశ్వరులు-సరస్వతీ చతుర్ముఖులు సకలఋషులు-కుబేరుఁడు మొదలైనవారు వచ్చిరి. "శంఖచక్ర గదాకమల కలిత చతుర్భుజుండును, పిశంగ, వర్ణవస్త్రుండును మకరకుండలమండిత గండ భాగుండును, శ్రీవత్సవక్షుండును, నలిన చక్షుండును, నిరంతర శ్రీవిరాజిత రోలంబకదంబవిలంబిత వనమాలికాపరిష్కృతుండును, కనక కంకణ కాంచీ కిరీట వలయాంగద నూపురాలంకృతుండును, కమనీయకంఠ కౌస్తుభాభరణుండును, నిజజనమనోహరుండును" నై యవతరించిన యా శ్రీహరి కొంతసేపటికి, యారూపము నుజ్జగించి, కపట వటుని చందమున నుపనయన వయస్కుండై గనుపట్టె.

జాబా——వామనునకు నుపనయనము గూడ గావించిరా యేమి?

గాల——మహర్షులెల్లరును కశ్యపమునీంద్రునిఁ బురస్కరించికొని, యక్కుమారునకు సముచితోపనయన కర్మ కలాపంబులు గావించిరి. "సవిత సావిత్రి నుపదేశించె, బృహస్పతి యజ్ఞోపవీతంబును, కశ్యపుఁడు మౌంజియు, గౌపీనంబదితియు, ధరణి కృష్ణాజినంబును, దండంబు వనస్పతి యగు సోముండును, గగనాధిష్ఠానదేవత ఛత్రంబును, కమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తఋషులు కుశపవిత్రంబును నిచ్చిరి. కుబేరుఁడు భిక్షాపాత్రనొసంగఁగా నందు పార్వతి యక్షయ మని వడుగునకుఁ భిక్షఁబెట్టెను.

జాబా——ఇట్టి మహోత్సవ సమయంబున నేను లేక పోయితినిగదా! ఉన్నచో తత్సందర్భమున వచ్చిన బ్రహ్మాదులను నాకు విస్తారముగ నమ్ము మార్గము జెప్పుడని యడిగి యుందును.

గాల——సరేలే! రా! ఈపుష్పములు గురువుగారి కొసంగవలయును.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



# దం న బ లి

## —: తృతీయాంకము :—

రంగము—[అమరావతి—నందనవనంబున సంధ్యావళియుఁ జెలికత్తెయగు ప్రియంవదయుఁ బ్రవేశించుచున్నారు]

ప్రియం— దేవీ! ఈ వనంబును గంటివా! ఎల్లెడ నల్లిబిల్లిగ నల్లుకొన్న పొదరిండ్ల క్రిందనున్న మల్లెమొల్లములును హృదయాహ్లాదకరములగు జాజులును, ఘుమ్ము ఘుమ్మని కమ్మని తెమ్మెరలఁ జిమ్ము సంపెఁగలును, మదనుని చేతినుండు ఖడ్గమును సానఁబెట్టు ననుపయిన పలకరాళ్లో యనఁ దగు గేదంగులును, మార్గాయాస సంజనితతృష్ణా విదారణ కారణంబులగు నారికేళ వృక్షములును, భూర్జఖర్జూరపనసనింబాదిబహువిధభూజంబులును విమలసలిలాసార పూరితములగు సరోవరంబులును, నాసరోవర తీరంబుల మత్స్యంబులఁ బట్టుటకై దొంగ జపంబాచరించుచు వేచియుండు బకంబులును, ముద్దు పలుకుల నుల్లంబుల రంజిల్లఁ జేయు శుకంబులును, కుహూకుహూధ్వానములు సేయు పికంబులును, బురులు విచ్చి యాడుచుఁ దమ సఖంబులచే సర

బులఁ జీల్చి యొడిసి పట్టుకేకి సముదయములును గలిగి యలరుచున్న ఈనందన వనరామణీయత మనకు నేత్రపర్వ మొనర్చుచున్నది.

సంధ్యా—(కొంచెము నడిచి) ప్రియంవదా! ఈరసాల భూజమెంత చక్కఁగ నున్నదో చూడుము?

సీ. చిగురు జొంపముల మ ♦ చ్చికఁ దిన నలవడి
కోయని కోకిలల్ ♦ కూకలిడియె
గమగను వలచు చ ♦ క్కని పూవుగుత్తులఁ
జూచి తుమ్మెదలు ఝం ♦ ఝుమ్మనినియె
వలకఁబాఱిన తీయ ♦ పండ్లనుగుచిఁ జూచి
చిలుకలు పలుకుల ♦ కులుకు లండె
నీడంబులన్ బసి ♦ నినువుల మేపుచుఁ
దద్దయు గువ్వలు ♦ ముద్దులాడె

తే. గీ. కోటరంబుల ఘూకముల్ ♦ గట్టువట్టె
గూనల జక్కనల్ పొరిఁబొరి. ♦ గూర్మిఁగాంచె
నచ్చటచ్చట శారికల్ ♦ ముచ్చటించె
దాన సహకార నామంబు ♦ ధన్యమయ్యె.

ప్రియం—(ఎదుటఁ జూపుచు) ఈ ప్రక్కనున్న కోనమాత్రము గమ్మ దున్నహామై యున్నది. చూడుము.

సీ. అల్లిబిల్లిగనల్లు ♦ వల్లిమతల్లుల
కల్లసిళ్ళగు పొద ♦ రిండ్ల పెల్లు
జిగిబిగి గరితోడ ♦ మిగులు ముండ్లును నాగు
లగపడఁ బూసిన ♦ మొగలిడొంక

లటమట నటియించు ♦ పటుదీర్ఘ వంశముల్
పెటలంగ మ్రోసెడు ♦ వెదురు బిల్లు
సిలువెల్లఁ గంటకా ♦ న్వితములై పుష్పించి
పోఁబోవ నడ్డగు ♦ లాబిచెట్లు
తే. నేఁగుచోఁ గ్రుచ్చుకొను పుల్ల ♦ రేగుతుప్ప
లిక్కడక్కడ నెక్కొను ♦ రక్కసిపొద
లొల్లమాలిన వల్లేరు ♦ వల్లికలును
జేరరానీవు పాంథ వి ♦ హారములను.

సంధ్యా—చెలీ! మన మాప్రక్కకుఁ బోవుదము - (కొంచెము నడిచి) అటుఁజూడుము-

ఉ. ఉన్నత శైలకంధరము ♦ నుండి ఝురంబదె సారసపంక్తి వి
ద్యున్నవరేఖ కాంతులను ♦ నొంది దరీముఖ పాళిశీకరో
ద్భిన్నత ఫేనపుంజముల ♦ బెంచి వడిన్ వికసించిలోతు పెం
పెన్నఁగ రాక జారి పడు ♦ నీ కొల నెంతయు మోదమిచ్చెడిన్.

(మఱియొక దెసకు నడిచి)

మ. ఒకచో మల్లియ పందిరుల్ విరియఁ బూ ♦ లున్ తోనె మందానిలా
హ్లాదకేళిన్ విరువెల్ల రాలిపడుఁ గ్రిం ♦ త్రెంచైన నేలొక్కెటన్
ప్రకట ప్రాభవ పక్వబాధ కశాన్ ♦ ద్రాక్షాగుళుచ్ఛం బులిం
చుక మున్ద్రుంది రసప్రవాహదటుచున్ ♦ జూపించు బాంధాళికిన్.

ప్రియం—అమ్మా!

చ. మలయగిరిన్ వసించి యల ♦ సూవన దివ్య సరంబునీగి యా
వలమలి నాటలాడి నవ ♦ పల్లవపాళిఁ గదల్చి మల్లికా
కలవకుళామ్ర కేతకుల ♦ కూటములందు మరంద మాని మ
త్తిలి ఘనసారవాసనలఁ ♦ దేలి సమీరుఁడు వీచె మెల్లఁగన్.

కావున మనమా జలజాకరతీరంబునఁ జంద్రకాంత శిలపైఁ గూర్చుందము.

(ఇరువురును కాసారతీరమునఁ గూర్చుందురు)

సంధ్యా—రమణీ! ఈలోకము భూలోకము కంటెఁ గడు సౌందర్యముగ నుండెను సుమా!

ప్రియం—నిజము. అందులకనే మహేంద్రుఁడీ యమరావతినివిడిచిపోవు నప్పుడు కన్నుల నీరుగార్చెనాఁడట! (ఎదుటజూచి) అమ్మా! దానవలోక సార్వభౌముఁడిట్లు వచ్చుచున్నాఁడు (లేచును)

సంధ్యా—(లేచి) అవునే! ఈయన యిచ్చటికేల వచ్చుచుండెనో!

(బలి ప్రవేశించును)

సంధ్యా—(బలిని సమీపించి) నాథా! నీపాదకముల కీసేవకురాలు నమస్కరించుచున్నది. (నమస్కరించును)

బలి—తరుణీమణీ! నందన వనవిహారమునకు వచ్చితివా! నీ విచ్చటకు వచ్చితివని నేనెఱింగియే యిట్లు వచ్చితిని. ఇటఁ గూర్చుండుము (ఆసీనుఁడగును)

ప్రియం—(పోఁబోవును)

బలి—(ప్రియంవదనుజూచి) ప్రియంవదా! నీవరిగెదవేమి; ఇటనుండుము నాకేమియు మీ దేవితో రహస్య సంభాషణము లేదు. (సంధ్యావళిఁజూచి) రమణీ! అతిథి- అభ్యాగతులను- బూజించుచుంటివి కదా! బ్రాహ్మణులను సత్కరించుచుంటివా! (ఇంచుక యూరకుండి) ఇంతకు ముందు మన వంశములోని వీరులందఱును గ్రూరకర్ములఁ జేసి, శౌర్యమూర్తులయినను దమ యధర్మముచే నశించిరి. కావున మనము అధర్మమునకుఁ జిత్తముల యందు

స్థానమీయరాదు. నీవు నిరంతరము దేవతారాధనములు, బ్రాహ్మణపూజలు గావించుచుండవలెను. ధర్మమే నన్నుఁ ద్రిభువనాధీశ్వరునిగా నొనర్చినదని గ్రహింపుము. మనము దైత్యులమేయైనను, నాకు భగవంతునియందు ద్వేషము లేదు.

మ. పరమాత్ముండజుఁడీజగంబుఁ బ్రతిక ♦ ల్పంబందుఁ గల్పించుఁ దా
బరిరక్షించును ద్రుంచునట్టి యనఘున్ ♦ బ్రహ్మాత్మునిత్యుం జగ
ద్భరితున్ గేవలు నద్వితీయుని విశు ♦ ద్ధజ్ఞాను సర్వాత్ము నీ
శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శ ♦ శ్వన్మూర్తిఁ జింతించెదన్.

సంధ్యా—దేవా! జగదేక పరాక్రమ విక్రముండవును, సత్యవ్రతాచార పారీణుఁడవును, నిరంతర దానకంకణ విరాజితుఁడవును నగు నీవు నా పూర్వసుకృతంబునఁ బతివైతివి. అట్టిచో నాకుఁ గొఱంత యేముండును. సంతతము నా చిత్తము ధర్మపథంబు నందే తగిలియుండునని విన్నవించుకొనుచున్నాను.

బలి—నీకు సమస్తము తెలియును. అయినను చెప్పుచుంటిని. మున్ను మా ప్రపితామహుఁడు మొదలగు వారందఱును భుజబలంబున గర్వించి, కన్నుమిన్నును గానక చరించి నశించిరి. చూడుము. మహాత్ముండగు శ్రీమన్నారాయణుఁడు,

మ. కనకాక్షుండు భుజావిజృంభణమునన్ ♦ క్ష్మాచక్రమున్ జాపఁ జు
ట్టినమాడ్కిం గొనిపోవ యజ్ఞమయుడం ♦ స్త్రీత్వాకృతిందాల్చి య
ద్దనుజాధీశ్వరుఁడాకి యబ్ధినడుమన్ ♦ దంష్ట్రాహతిన్ద్రుంప ధా
త్రిని గూలెంగులిశాహతింబడు మహా ♦ ద్రింబోలినత్యుగ్రతన్.

మ. సురలోకంబుఁ గలంచి దేవసమితిన్ ♦ సుక్కించి యుద్యద్గదా
ధరుఁడై వచ్చు నిశాచరుంగని కన ♦ ద్దంష్ట్రాకరాళాస్య వి

స్ఫురిత భ్రూకుటితో నృసింహాకృతి ర • క్షోరాజవక్షంబు భీ
కరభాస్వన్నఖరాజిఁ జీరెఁ దితిజగ • త్కల్యాణసంధాయియై

ఇట్టివన్నియు నీవు వినియే యుంటివి. ఆ శ్రీహరిలీల లగణ్యములు. ఆ మహాత్ముని దివ్యప్రభావ మెవ్వరును గనుఁగొనఁజాలరు. ఆ దేవదేవుని మాయ నెవ్వరును దాటఁజాలరు. అతఁ డెప్పుడును అధర్మపరులనాశనమొందించుటకే యవతార మెత్తుచుండును. భక్తితోఁ దన్ను సేవించువాఁడు చండాలుఁడైనను నాతఁడనుగ్రహించును. ఈ కారణముచేతనే నేను భగవత్ప్రీతిగ దానములు సేయుటయుఁ గ్రతువు లొనర్చుటయు నని నీవు తలంపుము. ధర్మము వలన దేహధారికి యశము గలుగును. ఆయశమే యాచంద్రార్క తారావనీశరధి స్థాయిగ నుండును.

సంధ్యా—నాథా! నర్మదానదీతీరమున నివాంక యాగము సేయ సంకల్పించితివే! అది యెప్పుడు జరుగునో వినవచ్చునా?

బలి—సమయమునకే ఈ సంగతి జ్ఞాపకము జేసితివి. ఈవిషయమును గూర్చి యోచించి, తగు నేర్పాటులు జేయుటకు మన గురుండైన శుక్రాచార్యుని రమ్మని ప్రార్థించియున్నాను. అతఁడు వచ్చుచుండును. నేనేగవలయును. (ఇంచుక యూరకుండి) సంధ్యాసమయమైనది. నీవు కూడ మందిరమున కేగుము.

సంధ్యా—ఆజ్ఞ ననుసరించెద.

(అందఱును నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.



# ధ్యానబలి.

## చతుర్థాంకము.

రంగము:—(వనమునందు-వామనుఁడు-గాలవుఁడు, జాబాలియు ప్రవేశించుచున్నారు.)

**వామ**—(గాలవునిఁ జూచి) గాలవా! నీవు పరమభాగవతోత్తముఁడవు కాఁగలవు. నీచిత్తమతి నిర్మలమైనదని నేను గ్రహించితిని.

**గాల**—గురుపుత్రా! నాకు ముక్తిమార్గముఁ జూపింపుము. సమస్తజ్ఞానపరిపూర్ణుఁడవగు నిన్నాశ్రయించినందులకు నన్నుఁ గృతార్థునిఁ జేయుము.

**జాబా**—నన్నుఁ గూడఁ గృతార్థునిఁ జేయవలయును. చదువురానివాఁడను.

**వామ**—గాలవా! నీయభీష్టము స్తవనీయమైనది. బ్రహ్మరుద్రమహేంద్రాది ప్రముఖు లేమహాత్ముని దివ్యపాదకమలముల సేవించి కృతార్థులగుచుందురో, యట్టి శ్రీమన్నారాయణుని నాశ్రయింపుము. ఆ మహాత్ముఁడే నిన్ను గ్రహింపఁగలఁడు. పంచేంద్రియంబులను బంధించి చిత్తవికారములను బెకలించి,

కామరోషాదులను గాసించి, నిరంతరానంద భరితమానసుండవై శ్రీహరినాశ్రయింపుము. ఆ శ్రీమన్నారాయణుండే సర్వలోక కారణుండు. సమస్తము నారాయణార్పణముం జేయుచుం జిదానందుండవై నిత్యము నాతనిని సేవింపుము.

గాల.—సేవింకను నన్ను మాయలోం బడవైచుచుంటివేమి? నీవుగాక మఱియొక శ్రీమన్నారాయణుండెవ్వరు? నీవే సమస్త సృష్టిస్థితిలయ కారణుండవు. సత్త్వాకారుండవైన నీయాజ్ఞశిరంబులం దాల్చి బ్రహ్మరుద్రాదులు వర్తించుచుందురు. దేహాద్యభిమానంబున సంసారసాగరమునంబడి దరిగానక యున్నవాండ.

జాబా.—(గాలవునిం జూచి) నీకిప్పుడు సంసారబాధ యేమున్నదిరా! భార్య వచ్చినప్పుడు నీవట్లు పలుకవచ్చును. (వామనునిజూచి) నేను పెక్కుసంవత్సరములనుండి మీతండ్రిగారి దగ్గఱ విద్య నభ్యసించుచున్నాను. గాలవుండు సంపూర్ణ పండితుండైనాడు. మందమతి నగునాకు ఒకశాస్త్రముగూడ పట్టుబడలేదు. ఈ గాలవునకుం జూపుమార్గము నాకుంగూడం జూపుము. కాని యొక్కవిషయము మాత్రము జెప్పవలసియున్నది. నేను పెండ్లి జేసికొనిన పిదప నీవు చెప్పుమార్గమునం జరింపవచ్చునా! పెళ్ళి జేసికొనకుండ నయినచోం గొంచెము చిక్కు తటస్థించును.

గాల.—మిత్రమా! నీవాక్కేటికకుం గొంచెముసేపు బీగము వేయుము.

జాబా.—వామనునితో నా సంగతిం జెప్పుకొనన క్కఱలేదా!

వామ.—మిత్రులారా? మీయిరువురును గూడ నామాటలువినుండు.

జాబా.—ఇప్పుడు నాకానందముగనున్నది. నేను వాగినదంతయునిందు నిమిత్తమే!

వామ—మిత్రులారా! ఈ షణత్రియమును వర్జించి, మోదఖేదములు సహముగాఁ జూచుచు, జగమంతయు నాత్మాధిష్ఠితముగా నెఱింగి మాయాదు లాత్మ తత్త్వాధీనములుగాఁ దెలియుచు జ్ఞానయుక్తుండవై విశ్వంబెల్ల శ్రీహరిగా భావించి మెలంగుఁడు. జన్మస్థానమేది? జననిజనక సోదరసతీసుతులు నిత్యులుగారు. సంపదలు చంచలములు. తనువు బుద్బుదప్రాయము. లోకమంతయు హరిమాయగా నెఱుంగుఁడు. (జాబాలితో) జాబాలీ!

మ. వనవాసిత్వము ముక్తిహేతువు గృహా ♦ వాసంబు సంసారబం
ధనమొందుచున్ వచియించుమాటపరసగా ♦ స్థంబంచు నూహింపఁగాఁ
దనునే దేనికిన్నైన హేతువుగనన్ ♦ స్వాంతంబెయూగాన, నా
మనమే బంధముముక్తియుంగొలుపును ♦ మ్మా! దీని శోధింపుమా.

గృహమును విడిచి భీకరారణ్యమున కరిగినయంతనే క్రోధము డుగదు. వనమునందుఁ గందమూలములు భుజించిన యంతనే లోభము పోదు. వనవాసియైనంతమాత్రమున మానవుఁడు ముక్తిఁ బడయఁజాలఁడు. చిత్తము నిలుపుకొనలేనిఁ వాఁడెచ్చటనున్నను నొక్కటే. చిత్తశుద్ధికలిగినవాఁడెచ్చటనున్నను శ్రీహరినిభజించి, మోక్షము బడయఁగలఁడు. మీరీ రహస్యముల నవలంబించుకొని శ్రీహరిని భజించి యభీష్టముల వడయుఁడు.

జాబా—అబ్బో! ఇది యింతయు మిగుల కష్టమే. అనాయాసముగా ముందు కావలసినంత భాగ్యము. తరువాత ముక్తియు లభించు మార్గమున్నచో బాగుండును. నేను బొందితోఁ గైలాసమునకుఁ బోవుట కేదయిన దారి యున్నదా! అనఁగా యిష్టము నిచ్చిసన్మానముకై లాసమునందుంచవలెను ఈలోకమునకు రానల

చినప్పుడు వచ్చుచుండవలెను. ఇంతయేల ? నాకును, నీక ముందు పెండ్లిగానున్న నా భార్యకును, నాకుఁ గలుగఁ సంతానమునకును జావులేని విధము చూడవలెను.

గాల.—(నవ్వుచు) ఏమిరా నీకోరిక! నీయాలు బిడ్డలకు, నీకును జూచుకొంటివిగాని నీతల్లి దండ్రులను గూర్చి యాలోచించలేదేమి ?

జాబా—నాతల్లి దండ్రులు వృద్ధులైనారు. ఇఁకనేను వారినిగూర్చి శ్రమ తీసికొన నక్కఱలేదు.

గాల—మాతృపితృభక్తిలో నిన్నుఁ జెప్పి మఱియొకరినిఁ జెప్పవలెను.

వామ—(నవ్వుచు) జాబాలీ నీకు మాటలయందున్న తెలివి విద్యయందు లేదేమికారణమో !

జాబా— నిఘంటువులను గ్రంథకారులు నానోటినుండి వెలువడు మాటలనుబట్టియే వ్రాసినారు.

వామ—మిత్రులారా! మనము వచ్చి చాలసేపైనది. అదిగో చూడుఁడు. సూర్యుఁడుగూడ నస్తమించినాఁడు. నేడు పౌర్ణమి యగుటచే చంద్రోదయముగూడ నైనది.

సీ. ప్రాచీదిశాంగనా ♦ ఫాలతలంబున
దీపించు సింధూర ♦ తిలకమనఁగ
దర్పించి విరహుల ♦ ధైర్యవల్లులఁద్రెంప
దర్పకుండెత్తిన ♦ దాత్రమనఁగ
సలిగి కాలకిరాతు ♦ డంధకారమృగంబు
ఖండింప మెఱయించు ♦ ఖడ్గమనఁగ
గగనభూజాలవృ♦తముతూర్పు కొమ్మను
లలితమై మెఱయు ప♦ల్లవమనంగఁ

ఆ. దొంగలు సంతసిల్ల ♦ దొంగలుభీతిల్ల
గడలి మిన్నుముట్టి ♦ కడలుకొనంగ
బొడిచె శీతకరుఁడు ♦ భూరిచకోరక
ప్రీతికరుఁడు జార ♦ భీతికరుఁడు.

ఇఁక మనము ఆశ్రమమునకుఁ బోవుదము రండు.

(అందఱును నడచుచున్నారు.)

(రామశాస్త్రి - సోమయాజి - యను నిరువురు బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.)

రామ—సోమయాజులూ! కనుచూపుమేరలో మనకేదియో యొక గ్రామము కనఁబడుచున్నది. ఈ రాత్రి కక్కడ విశ్రమించి, తెల్లవారఝామున లేచి ప్రయాణము సాగింతము.

సోమ—కానీ! త్వరగా నడువుము. చంద్రుఁడుగూడ నుదయించినాడు.

రామ—(గాలవునిఁ జూచి) గాలవా! ఈభూసురులెక్కడికి బోవుచుండిరో యరయుము.

గాల—(బ్రాహ్మణులను జూచి) బ్రాహ్మణోత్తములారా! మీ రెక్కడికిఁ బోవుచున్నారు.

రామ—చాలదూరము పోవలసియున్నది.

జాబా—చెప్పఁగూడదా యేమి!

సోమ—నాయనా! ఇందు రహస్యమేమియున్నది. బలిచక్రవర్తి నర్మదాతీరమున నొక గొప్ప యాగము సేయుచున్నాఁడు. బ్రాహ్మణులము కదా పోవుచున్నాము.

జాబా—అయ్యా! మీపేరేమి?

సోమ—సోమయాజులు.

జాబా—తమరు యజ్ఞముఁ జేసినారా యేమి?

సోమ—లేదు.

జాబా—తల్లిదండ్రులు పెట్టిన ముద్దుపేరేనా! శాస్త్రము లేనియిన పూర్తిగఁ జదివినావా!

సోమ—కొంచెము.

జాబా—నావలె గోళాకారమేనా!

వామ—జాబాలీ! ఈ యనవసర ప్రశ్నలెందులకు? మహనీయులతో హాస్య సంభాషణమా. (బ్రాహ్మణులను జూచి) బ్రాహ్మణోత్తములారా? ఈతఁడు హాస్యరసప్రియుఁడు. ఈతని మాటలను మీరు లెక్కగొనవలదు. (ఇంచుక యూరకుండి) మహాత్ములారా! మీరనేక దేశంబులఁ జూచియుందురు.

కం. వత్తురె విప్రులు వేడఁగ
నిత్తురె దాతలును వేడ్క ♦ నిష్టార్థములం
దెత్తురె మీరును సంపద
లిత్తెఱఁగునఁ దానమునఁ ♦ డెవ్వఁడొ సెప్పుఁడా.

సోమ—(తనలో) ఈవామనుఁడెవ్వఁడో కాని యద్వితీయ తేజముతో విరాజిల్లుచున్నాఁడు. (ప్రకాశముగా)

మ. కలరుగా దాతలు నిత్తురున్ ధనములుం ♦ గామ్యార్థముల్ గొంచు వి
ప్రులు నేతెంతురుగాని యీపని బలిం ♦ బోలన్వదాన్యుండు లేఁ
డలఘుండై యొనరించె నధ్వరశతం ♦ బాభార్గవానుజ్ఞచే
బలివేడం బడయంగవచ్చు బహుసం ♦ పల్లాభముల్ వామనా.

జాబా—నే నాబలిదగ్గఱకుఁబోయి యాచించినచో నాపెండ్లికేమయిన ధనమిచ్చునేమో!

వామ—(బ్రాహ్మణులను జూచి) బ్రాహ్మణోత్తములారా! ఇప్పుడు మీరెచ్చటికిఁ బోవుదురు. ఈరాత్రి మా యాశ్రమంబున మాయాతిథ్యం బంగీకరింపుఁడు.

రామ—ఇంతకంటె మాకుఁ గావలసిన దేమున్నది.

వామ—పోవుదము రండు.

(అందఱును నిష్క్రమింతురు.)

రంగము:—(కశ్యపాశ్రమము;—ప్రవేశము - కశ్యపుఁడు - అదితి వామనుఁడు.)

కశ్య—(వామనునిఁ జూచి) నాయనా! వామనా!

క. ఏనిన్ను నఖిలదర్శను
జ్ఞానానందస్వరూపు ♦ సంతతు నపరా
ధీనుని మాయాదూరుని
సూనునిఁగాఁగంటి నిట్టి ♦ చోద్యము గలదే.

ఉ. విశ్వము లీలఁద్రిప్పుచు న♦విద్యకుఁ జిక్కవు వైననీకుఁ దా
శ్వాతమైన కాలమిది ♦ సర్వము వేడ నిందుఁబుట్టి వి
శ్వేశ్వర మేలుకుప్ప నిను ♦ నెవ్వఁడు గొల్చు ఘనుండు వాఁడ పో
శాశ్వత లక్ష్మిమృత్యుంజయ♦ సౌఖ్యయుతుం డభయుండు నందనా.

అదితి—

ఆ. విలయకాలమందు ♦ విశ్వంబునీ పెద్ద
కడుపులోన దాచు ♦ కడిమి మేటి
నటుఁడవీవు నేఁడు ♦ నాగర్భజుఁడ వౌట
పరమపురుష వేడ ♦ బంబుగాదె.

వామ—(అదితింగాంచి) తల్లీ! పూర్వము స్వాయంభువ మన్వంతరంబున నీవు పృశ్ని యనుపేరఁ బరఁగిన సాధ్వీమణివి. ఈతఁడు సుతపుండను ప్రజాపతి. పుణ్యదంపతులగు మీరాయిరువురు నాకై పరమనిష్ఠాగరిష్ఠులై తపంబొనర్ప, నేను ప్రసన్నుఁ

డనై మీ కేమి వరంబులు గావలయునని యడిగితిని. సంతాన
నములేని మీరు నన్ను నాయట్టి కొడుకు నొసంగుమని కోర
నట్లే యొసంగి, మీకుఁ బృశ్నిగర్భుండను నందనుఁడనైతిని.

క. అదితియుఁ గశ్యపుఁడనఁగా
విదితులరగు మీకుఁ గుఱుచ ♦ వేషంబుననే
నుదయించితి వామనుఁడనఁ
ద్రిదశేంద్రానుజుఁడనై ద్వి ♦ తీయభవమునన్.

ఇఁక నొక భవంబున మీయందు నాకు జన్మమున్నది. తరు
వాత మీయందెప్పటికిని నాకు జన్మములేదు.

క. నందనుఁడనియుం బరమా
నందంబగు బ్రహ్మమనియు ♦ నను గొలుచుచు నా
పెందెరువు నొందెదరు నా
యందుల ప్రేమమున భవము ♦ సంహరుమీరల్.

అది—వత్సా! వామనా! జగత్కారణుండవగు నీకుఁ దెలియని విష
యంబులేవియును లేవు. కాని, నేనిందు నిమిత్తమాత్రను. నీయ
గ్రజుఁడగు మహేంద్రుఁడు దానవనాథుఁడగు బలికోడి, సమస్త
రాజ్యశ్రీని వీడి యాలుబిడ్డలతో సంచందుఁ జరించుచున్నాడు.
బలి యమరావతిని పాలించుచున్నాఁడు. నీవిఁక నెట్లయిన బలి
సంపద హరించి శచీనాథుని సురల నమరలోక సామ్రాజ్య
సింహాసనాసీనుం జేసి, యమరుల నుద్ధరింపుము.

కశ్యప—నాయనా! అసురలోకసంరక్షణ మవశ్యమాచరణీయము. జగ
న్నాటక సూత్రధారివగు నీవు మాపూర్వపుణ్యవశమున దన
యుఁడవైతివి. అట్టిచో నీకు నేనింతకన్న నేమియుఁ జెప్పఁ
జాలను.

వామ—తండ్రీ! నే నందులకొఱకే కదా మీకు సుతుఁడనైతిని. ఆ విషయ మట్లుండనిండు. జననీజనకులయాసతిఁ దీర్చుటకన్నఁ బుత్రునకు మఱియొక సుకృతమేమి యున్నది? తన జన్మమునకుఁ దండ్రియే మూలమని యెఱింగిన వివేకశాలియైన పుత్రుఁ డెవ్వఁడైనను, దండ్రియాజ్ఞ శిరంబునఁ దాల్పకయుండునా? తండ్రి- పూజ్యుఁడు - దైవము గురుఁడు. సత్కుమారుఁడు అవసరమైనచోఁ దనప్రాణములఁ బరిత్యజించియైనఁ దల్లిదండ్రులకుఁ బ్రియంబుఁ గూర్పవలయును. ఇట్టిదే పుత్రధర్మము. అట్టి పుత్రుఁడే జగంబున శాశ్వతకీర్తి నందును. (ఇంచుక యూరకుండి) నేను నేఁడే విబుధలోకసముద్ధరణకార్యోద్యోగినై బలిం జేరి, యాతని సంపదల హరించి, యమరలోకము మహేంద్రునకుఁ గూర్చి, మీకానందముఁ గూర్చెదను.

జాబాలి—(ప్రవేశించి) శ్రీమన్నారాయణ స్వరూపా! వామనా! నీ జననంబున నీజననీ జనకులు ధన్యులైరి. నీవంటి మహానీయు లుద్భవించుటచేతనే యార్యావర్తము పవిత్రమైనది. నీవు తలంచిన యమరలోకరాజ్యోద్ధారణము సత్వరముగనే జరుగుగాక! గంగాస్రవంతీ వీచికాపరంపరలయందుఁ బావనత్వ మెందాక నుండునో, దివాకర సుధాకరు లెందాక నుందురో, యంతవఱకు భవదీయకీర్తి యుండుఁగాక! భక్తులు నీపరమపవిత్రచరిత్రమును గానము చేయుదురుగాక!

కశ్య—ఓరీ! ఎక్కడఁ దిరుగుచుంటివి? ఇప్పుడువచ్చితివి?

జాబా—స్వామీ! గాలవుని సమిత్కుశఫలాహరణార్థము పంపినాను.

కశ్య—నీసంగతి నేనడుగుచుంటిని.

జాబా——నేనును గాలవునితో మొదట బయలు దేరితిని. కాని కొంత దూరము పోయి వెనుకకు వచ్చితిని. వచ్చుచుండఁగా దారికడ్డముగా నొకసర్పము పడియున్నది. దానింజూచి భయమంది ముందునకు కదుగు వేయలేక నెమ్మదిగా నక్కడనున్న వృక్షమెక్కి, ఆసర్పము పోయినతరువాత నేగవచ్చునని కూర్చుంటిని. ఆసర్ప మెంతసేపటికిని పోదు. అది సర్పమా కాదా యని చెట్టుపైనుండి ఏకదృష్టితోఁ జూడఁగా, తుదకు త్రాడని తోచినది. కాని, బాగుగా గ్రహించలేక పోవుటచే చెట్టు దిగివచ్చుటకు భయముగానే యుండెను. ఇంతలో భగవంతుని దయవలన నామార్గమునఁ దనకేదారమునకుఁ బోవు కాపువాడొకఁడు వచ్చెను. దారిలో నున్నది పామని చెప్పినచో నది త్రాడేమో! అట్లయిన; బ్రాహ్మణుఁడు భయమందిన వాడని వాఁడు తలంచును. అందుల కుపాయ మాలోచించి, యాతనినిఁ జూచి, క్రిందబడియున్న త్రాడు నాకందీయుము ఆకులను కట్టుకొనవలయునని పలికితిని. పామని నేను తలంచిన త్రాడు నాతఁడు నాకుఁ జెట్టుపై కెగర వేసెను. అంతట నేన నాయవివేకమునకు నవ్వుకొనుచుఁ జెట్టు దిగి యిట్లు వచ్చితిని.

వామ——మిత్రమా! ఒకకథనొక పురాణముఁ జేసితివే!

జాబా——ఒకరికిఁ జెప్పు విషయము సవిస్తరముగా నుండవలయును (ఇంచుక యూరకుండి) ఈవిషయమున కేమిగాని, బలి యొద్ద కెప్పుడు పోవుదము

వామ——నీవు గూడ వచ్చెదా యేమి?

జాబా——వచ్చుటేల? ఇంట్లో యుందునా? నీవెంట నేను గూడ వచ్చెదను.

(కశ్యపుని జూచి) మహాత్మా! ఇందులకుఁ దమ రనుజ్ఞనీయవల యును. ఆ మహోత్సవ సందర్భమున-మడత పూరీలును,పులి హోర మొదలగునవి చేయుచున్నారఁట. చాల రుచికరముగ నున్నవని విన్నాను. అవి తినవలెనని భ్రాంతి కలిగినది.

వామ—(నవ్వుచు) ఇందులకేనా నీవు నాతో వచ్చునది.

జాబా—తిన్నది జీర్ణమగువఱకు నీవేపనిచెప్పినను జేయుదును.

కశ్య—వామనా! జాబాలిని నీవెంటఁ దోడ్కొనిపొమ్ము.

జాబా—ఆహాహా! నాభాగ్యము పండినది. (గంతులు వేయును)

వామ—(అదితి కశ్యపులను జూచి) నేటి వేకువఝూమున బయలు దేరెదను.

కశ్య—మంచిది.

జాబా—వామనా! భోజనమునకు వేళ యైనది. స్నానమునకుఁ బోవుదము రమ్ము.

వామ—పోవుదము.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.





# దానబలి.

## పంచమాంకము

రంగము:—(బలియజ్ఞశాలముందు జాబాలి ప్రవేశించుచున్నాఁడు.)

జాబాలి—(తనలో) యాగమహోత్సవముఁ జూచుటకు నాకీ రెండుకన్నులును జాలకయున్నవి. ఒకచోట బ్రాహ్మణుల వేదఘోష. ఒకప్రక్క శ్రీహరిసంకీర్తనముసేయు భక్తబృందము. ఒకదెస దగుదుమని తైతక్కలాడు వేశ్యాంగనలు. బండ్ల గబగబలు- గుఱ్ఱముల సకిలింపులు- రథచక్రముల కిఱ్ఱుచప్పుడులు- మత్తగజ ఘీంకారములు- మంగళవాద్యములు- దానముల కొఱకు బ్రాహ్మణుల పరుగులు- మొదలగునవి చూచి నా చిత్తమున కపరిమితానందము కలుగుచున్నది. ఏ బ్రాహ్మణుని నోటినుండి వచ్చినను బలివంటి వదాన్యుఁడు లేడను మాటయే. (ఇంచుక యూరకుండి) యాగవైభవమున కేమిగాని, ఆహా? ఏమి భోజనసదుపాయము! ఇట్టి భక్ష్యములుగాని, కూరలుగాని నే నెప్పుడును తినియుండలేదు. ఈ బలి బ్రతికియున్నంతవఱకు నిట్లేయజ్ఞములుచేయుచున్నచో బాగుండును. పెండ్లియైన తరువాత నా భార్యతోఁ గూడ నిక్కడనే యుందును.

(రామశాస్త్రి, సోమయాజులు ప్రవేశించుచున్నారు.)

జాబా.—(బ్రాహ్మణులను జూచి) రాత్రి మళ్ళీ మీరు కనిపించనే లేదు. భోజనమైన తరువాత మీకొఱకు వెదకినాను.

సోమ.—మాయందు కొంచెము అభిమానముంచినావు.

జాబా.—సరి సరి యెంతమాట. ఇట్టి సమయములలో మనము కలసి మెలసి యుండవలెను

జాసు.—(రామశాస్త్రినిజూచి) మొన్న మన యాశ్రమంబున నాతిథ్యమొసంగిన వాఁడునుఁడుకూడ వచ్చినాడు. నీవు చూచితివా!

రామ.—చూచితిని. (ఇంచుకయూరకుండి) ఈ యాగమునకు గొప్ప యేర్పాటులు చేయఁబడినవిసుమా! అనేకమంది రాజులు యాగములు సేయఁగా మనము చూచియుంటిమి గాని యింత వైభవముగా జరిగిన యాగ మెచ్చటఁ జూడలేదు.

జాబా.—ఈ యాగములో నిన్న చేసిన పిండివంట కయినఁతో సామ్మ్యమును మీరుచూచిన యాగములకైయుండదని నేను చెప్పఁగలను! రాత్రి తిన్న పదార్థముల రుచి, యింతవఱకును జిహ్వను వదలలేదు. (ఇంచుకయూరకుండి) సోమయాజులుగారూ! నేను చెప్పినానని మీరు మఱియొకవిధముగాఁ దలఁపవలదు. మీరు వెళ్ళునప్పుడు నెమ్మదిగా కొన్ని భక్ష్యములు యింటికిఁ దీసికొని వెళ్ళుఁడు. పిల్లలు తిందురు

సోమ.—జాబాలీ! నీ వన్నియు నవ్వఁవచ్చు మాటలేకదా!

రామ.—(జాబాలినిజూచి) నిన్న నడుగుటకు మఱచితిని. మీవామనుఁడు శాస్త్రాభ్యాసము పూర్తిగఁజేసెనా!

జాబా.—శాస్త్రిగారూ! మీరువామనుని సంగతి నడుగుచున్నారా ఆతనికొక విద్యవచ్చును. ఒకటిరాదు,అనిచెప్పుటకు వీలులేదు

ఆతనికుక్షి సమస్తవిద్యలతో నిండియున్నది. నిన్నసభలో మీరు చూడలేదాయేమి ! సింహమువలె, పులివలె, లేడివలెఁ జరించినాఁడు. మావామనుని రాకఁజూచిన యంతనే సభ యంతయు నదియొకవిధమునఁ గన్పట్టెను. ఆతఁడు సభాప్రవేశము సేయునప్పుడు,

శా. శంభుండో హరియో పయోజభవుఁడో ♦ చండాంశుఁడో వహ్నియో
దంభాకారతవచ్చెఁగాక ధరణిన్ ♦ ధాత్రీసురుండెవ్వఁడీ
శుంభద్ద్యోతనుఁ డీమనోజ్ఞతనుఁ డం ♦ చున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁగని ♦ తత్సభ్యుల్ రహస్యంబుగన్.

క. గుజగుజలు వోవు వారును
గజిబిజిఁబడువారు జాల ♦ గలకలపడుచున్
గజిబిజియైరి సభాస్థలిఁ
బ్రజలెల్లను బొట్టివడుగు ♦ పావనిరాకన్.

ఆతఁడు సభాప్రవేశముఁజేసి లింగము విఱ్ఱింగిన పూజారివలె నున్నాఁడనుకొన్నారా యేమి ? సభయందున్న మహనీయులయొద్ద నే విధమైన విద్యాశక్తి యెంతయున్నదో గ్రహించుచుఁ జరించినాఁడు.

సీ. చవులుగాఁ జెవులకు ♦ సామగానంబులు
చదువునుద్గాతల ♦ చదువువినుచు
మంత్రితంత్రార్థ సం ♦ బంధభావములు, వే
ర్వేరను యాయజూకులఁ ♦ గూడికొనుచు
హోమకుండంబులం ♦ దున్నత్రేతాగ్నుల
వెలిగించు యాజక ♦ వితతిఁగనుచు
నతులై బహువిధా ♦ ధ్వర విధానంబులు
సెప్పెడు సభ్యులఁ ♦ జేరఁజనుచుఁ

తే. బెట్టుగోరెదు వేమక ♦ వట్టుపఱుప
నదితి పుట్టువు లచ్చికి ♦ నాటపట్టు
గోరి చరియించె సభలోనఁ ♦ గొంతఁ దెకవు
పుట్టు వెన్నఁడు నెఱుఁగని ♦ పొట్టివడుగు.

సోమ—మహాపురుషుఁడని యాతని తేజమే తెలుపుచున్నది. ఆతఁ డింకను బలిం జూడలేదా యేమి?

జాబా—బలియును శుక్రాచార్యులును నాతని నింకను జూడలేదు.

రామ—వదాన్యుఁడగు బలి- వామనుని నెక్కువగ సత్కరించును.

జాబా—ఇంకను మీరీ సంభాషణము పెట్టుకొని యాలస్యము సేయుచున్నారేమి? వచ్చిన కార్యమున కుపక్రమింపక,

సోమ—ఏమి కార్యమున్నది?

జాబా—మీరు వచ్చిన దెందులకు? భోజనముచేసి పోవుటకా! ఏదో కొంచెము ఇంటికిఁ బోవునప్పుడు చెంగున ముడివేసికొనవలదా! సోమయాజులుగారూ! మీ వేషమేమీ బాగు లేదు. ఒక శాలువ తలకుఁజుట్టి, యొకటి పైన వేసికొనుఁడు. లోపలనుండు విద్య యెట్లున్నను, పైవేషము డాంబికముగ నుండవలయును సభలలో విద్యావంతులకన్న నిట్టివారే గొప్ప సత్కారములను పొందుచున్నారు. మనది వైదికవృత్తియైనను కొంచెము నియోగము మిశ్రమము చేయవలయును. (రామశాస్త్రినిజూచి) మీవేషము బాగుగనే యున్నది.

వామ—(ప్రవేశించి జాబాలినిఁ జూచి) ఇక్కడనే యుంటివేమి? (ఆకసమువంకఁ జూచుచు) అటు జూడుము.

సీ. పౌలోమి తనబాలు ♦ పాన్పుపైఁ గనుపట్టఁ
బన్నిన పవడంపు ♦ బంతియనఁగ
నాయురర్థముల వ్య ♦ యంబులో త్రిలి చాటు
కాలజాంఘికు చేతి ♦ ఘంటయనఁగ
ఘనజంతు జీవిత ♦ కాలరాసులవిధి
కొలువనెత్తిన హేమ ♦ కుంభమనఁగ
బలిమహోన్నత్యాగ ♦ పరఁగఁగ్రీ సేయుచో
ముంగట నిడుకొన్న ♦ ముకురమనఁగ

తే. గోపతాపోప శమనదివ్య ♦ గుటికయనఁగ
బద్మినీకాంత నోముల ♦ ఫలమనంగ
మూడుమూర్తుల సారంపు ♦ ముద్దయనఁగ
ఇంహార మండల ముదయాద్రి ♦ మీఁదనొప్పె

ఇంక మనము యజ్ఞవాటికఁ బ్రవేశింపవలయును. బ్రాహ్మణోత్తములు మొదలగువారందఱును పోవుచున్నారు.

జా. బా.—నీయాలస్యమే గాని నాయాలస్య మేమియును లేదు. ఎప్పు డా బలి యెదుటఁ బడి, యూఁడిచ్చుదక్షిణ మూటఁగట్టుకొందునా యని వేచియున్నాను. (బ్రాహ్మణులను జూచి) సోమయాజులు గారూ! రామశాస్త్రిగారూ! రండు. త్వరగాఁ బోవుదము.
(బ్రాహ్మణులును - జాబాలియు నిష్క్రమింతురు.)

వామ.—(తనలో) ఆహా! బలివైభవము వర్ణనాతీతము కదా! మహేంద్రునకైనను నట్టి వైభవము లేదు. ఈబలి త్రిభువనములకు నధీశుఁడై యుండుటయే గాక, చతుర్దశభువనాధిపత్యమునకైనను నర్హుఁడనుట కావంతయును సందియము లేదు. ఈతనియందున్న

వదాన్యతయు, సత్యసంధతయు మున్నెవ్వరి యందును వినఁ బడవు. ఇట్టి సకలసద్గుణ విరాజితుని, నిరంతర దేవతా బ్రాహ్మణపూజారతుని నెట్లు వంచించి, ఆతని రాజ్యశ్రీల నమరేంద్రున కొసఁగూర్తు ; ఆతనియం దేమి దోషముపాడ గట్టుచున్నది. (ఆలోచించి) అమరేంద్రుని రాజ్యము హరించు టయేకదా! బలవంతులయినవారు నిజ భుజబల శౌర్యంబులఁ బ్రకటింపఁ బరరాజులను జయించి, వారి రాజ్యంబులఁ గొనట వీరచూడామణుల కాచారమని ధర్మశాస్త్రములయందుఁ జెప్పఁ బడియున్నది. అట్టిచో నితం డందు ధర్మవిరుద్ధ మేమియున్నది! (ఆలోచించి) అకారణముగ నమరేంద్రుని రాజ్యము హరించి యాతనిని వెడలనడుపుటయే కారణముగాఁ గొనవలయును. (ఇంచుక యూరకుండి) ఇదియు నంత సమంజసముగా లేదు. ఆతనిని వంచించుటకు నాచిత్తము సమ్మతింపకయున్నది. (ఆలోచించి) ఏమిచేయుదును! నేనూరక యుంటినేని దేవేంద్రుఁడు కానన నీమఁ బరిపాలింప వలసినవాఁడే! ఇది యట్లుండ నేనవ తరించినది యమరలోకము నుద్ధరించుట కేకదా! ఇఁక యోచింపనేల - ఇంచుక యూరకుండి ఒకరికి హానిరాని విధమున రాజ్యశ్రీలఁ గూర్చెదఁగాక!

(నిష్క్రమించును)

రంగము—(యాగశాల—బలిచక్రవర్తియు-శంబరుఁడు శుక్రాచార్యులు నుందురు-జాబాలి-రామశాస్త్రి-సోమయాజులు మొదలగు బ్రాహ్మణులుందురు.)

బలి—(శుక్రాచార్యునిఁ జూచి) ఆచార్యా! నీయమూల్య కరుణా విశేషమున నిట్టి మహాయాగము నేయుచున్నాఁడ - (ఇంచుక

యూరకుండి) మహాత్మా! ఎవ్వరికిని ఏవిధమయిన కొఱంతయూ గలుగకుండ యాగము యథావిధిగ జరుగుచున్నదికదా! భోజన దక్షిణ విషయంబులందు భూసురోత్తములు సంతృప్తిఁ బొందుచుండిరి కదా!

శుక్రా—దానవేంద్రా! ఏవిధమయిన లోపము లేదు-ఇట్టి దానములు మున్నెవ్వరును నిచ్చియుండ లేదనియు, నిట్టి యజ్ఞము పూర్వ మెవ్వరిచేతను చేయఁబడ లేదనియుఁ జెప్పుకొని బ్రాహ్మణులు సంతోషించుచున్నారు.

రామశాస్త్రి—(సభలోనుండి లేచి శుక్రాచార్యుని సమీపించి) అయ్యా! శుక్రాచార్యుల వారూ! మీరు ఆస్థానపురోహితులు గావున మాయందుఁ బరిపూర్ణ దయనుంచ వలెను.

సోమయాజులు—అందఱివలె మమ్ముఁ జూడవలదు. నాలుగు వేదములను దలక్రిందులుగాఁ జదువఁగలను.

జాబాలి—(రహస్యముగా సోమయాజులతో) అందఱివలె నాలుగు వేదములను చదువఁ గలనందువేమి! ఇందులో నీ గొప్పయేమున్నది? అయిదు వేదములని చెప్పుము. ఐదవదానికి నేనే గ్రంథకర్తనను. సంశయింపకుము.

రామ—నేను వివాహములు మొదలయిన శుభకార్యములు ముందు వెనుకలు చూడకుండఁ జేయింపఁగలను.

జాబా—(రామశాస్త్రితో) అపరకర్మల సంగతి మఱచిపోయినావు. (తనలో) ఈ యిద్దఱికిని డొక్కచీరినను అక్షరము కనఁబడదు. నాకు పెద్దన్నయ్యలే. (ప్రకాశముగా శుక్రాచార్యునితో) మీకు సంశయమున్నచో విద్యాపరీక్ష జేసినపిదప బహుమతి నిప్పింపుఁడు.

సోమ—(తనలో) ఈ జాబాలిముండాకొడుకు అసాధ్యుఁడు. అనవసర సంభాషణము అధికము. ఈతని మాటలు విని శుక్రాచార్యుఁడు నన్ను వేదములో నే పనసయైనఁ జెప్పుమన్నచో నేమి చెప్ప గలను ? గ్రుడ్లు రెండును నప్పగించి నిలువవలసిన దే.

జా. బా.—సోమయాజులుగారూ ! చూచెద రేమి ! సామవేదములో రెండు పనసలు కానియ్యండి.

రామ—(తనలో) మాకు వీఁడెక్కడ దాపరించినాఁడు (ప్రకాశముగా జాబాలిని జూచి) మే మేదో శుక్రాచార్యులవారితో మాసంగతి చెప్పుకొనుచుండఁగా మధ్య నీ వనవసరముగ మాటలా డెదవేల ?

జాబా—అసందర్భపు మాట యేమియును నేను మాట్లాడలేదు. (శుక్రాచార్యునిఁజూచి) అయ్యా ! నేనుగూడ గొప్ప పండితుఁడనే. పేదవాఁడనగుటచే శాలువ వేసికొనలేక యూరకున్నాను. చక్రవర్తితోఁ జెప్పి, తమరిప్పించినచో వేసికొందును. వేదములు తలక్రిందుగాఁ జదువలేనుగాని, నిలబెట్టి చదువఁగలను. తర్కవాదములో కర్కశవాదము. కాదన్న అవునందును. అవునన్న కాదందును. వ్యాకరణ శాస్త్రములోఁ జెప్పనక్కఱలేదు. సూత్రములుతప్పఁ దక్కినదంతయు నున్నది. కవిత్వము:—అందులో ఆశుకవిత్వము:—నానోటినుండి వెలువడినమాటలెల్ల శ్లోకములేయని మీరు భావించవలెను. సాధారణముగా ఘంటకు రెండువందలు శ్లోకములు చెప్పగలను. పట్టుదల కలిగినచో సభలో నైదువందలవఱకు గంగాప్రవాహమువలెనే వెళ్లును. ఇంకను సమర్థతఁ జూడవలెనని యెవ్వరైన దలఁచినచో, నాలుకఁజాపి నిలిచియుందును. నోరుకదప నవసరములేదు. శ్లోకములు

నాభినుండి బయలువెడలి నాలుకపైఁబడి క్రిందకు దొర్లును. మీరుపరీక్ష సేయఁదలఁచినచోఁ జేయవచ్చును, సాధారణముగా శాస్త్రవాదములుకలిగినప్పుడు నాకొక యలవాటున్నది. నాతో వాదమునకు దిగినవారు నిలబడినచో నేను కలబడుదును. వారు కలబడినచో నేను నిలబడుదును.

శుక్రా—(నవ్వును)

ఒక బ్రాహ్మణుఁడు—(బలింజూచి) మహారాజా! దూరదేశమునుండి వచ్చితిని. నాకుమారునకు వివాహము సేయ నిశ్చయించినాను. రిక్తహస్తుఁడను. ఈ కార్యము తమకటాక్షమువలన జరుగవలయును. వాఁడొక యింటివాఁడగును.

జాబా—(బ్రాహ్మణుని జూచి) అయ్యా! అబ్బాయి యేమి చదువుకొన్నాఁడు.

బ్రాహ్మణుఁడు—చదువు కొంచెము తక్కువే.

జాబా—తమకు భూవసతి యేమైన నున్నదా!

బ్రాహ్మ—వసతి యున్నచో ఈ యాచన యేల?

జాబా—యాచనజేసి అబ్బాయికి పెళ్లి చేయఁదలఁచినారా! బాగుగనే యున్నది. చదువు లేదు. సంపద లేదు. అమ్మాయి యింటికివచ్చి అబ్బాయిని అదితే యిదితే యని యడిగినప్పుడు తెలియును. తగినంత శక్తిలేనప్పుడబ్బాయి మెడకు సంసారపు గుదిబండ తగిలించడ మెందులకు?

బ్రాహ్మ—(తనలో) వీనికి యనవసరపు గొడవ యెందుకో.

బలి—(బ్రాహ్మణుల నందఱిని జూచి) బ్రాహ్మణోత్తములారా! ఇటు రండు.

బ్రాహ్మ—(బలిని సమీపింతురు.)

బలి—మహాత్ములారా! ఈ స్వల్పదానంబుల గ్రహించి నన్నుఁ గృతార్థునిఁ జేయుఁడు. నే నెప్పుడును మీ కరుణకుఁ బాత్రుఁడ (బ్రాహ్మణు లందఱికిని దక్షిణాల నిచ్చును.)

బ్రాహ్మణులు—బలిచక్రవర్తి యొక్క వైభవ మాచంద్రార్కతారా వనీ శరధి స్థాయిగనుండుఁ గాక!

వామనుఁడు—(ప్రవేశించి తనలో) ఇఁక నేను బలిం జేరెదఁగాక (కొంచెము నడచును)

జాబా—(తనలో) మా వామనుఁడు బలిని సమీపించు చున్నాఁడు. ఏమి దానమడుగునో!

రామ—(సోమయాజిని జూచి) సోమయాజులూ! ఈ వామనుని దివ్య తేజము జూచి, శుక్రుడు గూడ విస్మయమందు చున్నాఁడు. ఈతఁడు కొంచెమైనను సంశయింపక బలిని సమీపించు చున్నాఁడు.

శుక్రా—(బలిం జూచి తనలో) "కరచరణాద్య వయవంబులు ధరించిన వేద రాశియును బోలె నిటు వచ్చుచున్న సదండచ్ఛత్రుండును, గతలంబిత భిక్షాపాత్రుఁడును, గరకలిత జలకమండలుండును, మనోహర వదన చంద్రమండలుఁడును" అగు నీవటుఁడెవ్వరో కదా? అమేయ తేజోవిలసితుఁడై యున్నాఁడు.

వామ—(బలిని సమీపించి)

మ. ఇతఁడే దానవచక్రవర్తి సుర లోకేంద్రాగ్ని కాలాది ది
క్పతి గర్వాపనయ ప్రవర్తి గతలో భస్వార్తి నానామఖ
వ్రత దానప్రవణానువర్తి సుమనో రామామనో భేదనో
ద్ధత చంద్రాత పకీర్తి సత్యకరుణా ధర్మోల్లస న్మూర్తిదాన

ఉ॥ స్వస్తి జగత్త్రయీభువన ♦ శాసనకర్తకు హీనమాత్ర వి
ధ్వస్తనిలింపభర్తకు ను ♦ దారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర వి ♦ ధాన విహర్తకు నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరి ♦ హర్తకు దానవలోక భర్తకున్.

బలి—(పీఠమునుండి లేచి వామనునిం గాంచి) భూసురోత్తమా! పరమ పవిత్రమైన నీ పాదసరోజములకు నమస్కరించుచున్నాను. (వామనుని పాదములకు నమస్కరించి) మహాత్మా! ఈ భద్రపీఠమున నాసీనుఁడవు గమ్మి.

వామ—(ఆసీనుఁడగును.)

బలి—(వామనునిఁ జూచి)

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సం ♦ వాసస్థలం బెయ్యది
య్యేఁడకున్ నీవరుదెంచుటన్ సఫలమ ♦ య్యెన్ వంశముల్ జన్మముల్
గడు ధన్యాత్ముఁడనైతి నీముఖము సౌ ♦ ఖ్యంబయ్యె నా కోరికల్
గడతేరెన్ సుహృతంబులయ్యె శిఖులుం ♦ గల్యాణమిక్కాలముల్.

మహాత్మా! నేను నిరంతరమును విప్రపాదసరోజరేణువులను గిరీటంబున ధరింతును. బ్రాహ్మణసేవయే నా యభివృద్ధికిఁ గారణమని యెఱింగినవాఁడను. భూసుర పదరజంబు శిరంబునఁ దాల్చు నలఘులకు సర్వ పాపక్షయమును, సద్గుణవాప్తియుఁ గలుగును. (ఇంచుక యూరకుండి)

మ. వర చేలంబులొ మాడలో ఫలములో ♦ సస్యంబులో గోవులో
హారులో రత్నములో రథంబులొ విశి ♦ ష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో ♦ గ్రామంబులో భూములో
ధరణీఖండమొ గాక యేమడిగెదో ♦ ధాత్రీసురేంద్రోత్తమా.

సోమ—రామశాస్త్రీ ! చూచినావా ! వామనుని బలి యెట్లు గౌర
వించి యడుగుచున్నాఁడో !
బాబా—సోమయాజులుగారూ ! మహాసభలలో నట్టివారు గాక
మనమా గౌరవింపఁబడువారము. వినుఁడు. వామనుఁడేదో
బలికి ప్రత్యుత్తరము జెప్పుచున్నాఁడు.
వామ—(తనలో) ఈతని యద్వితీయ బ్రాహ్మణభక్తి నెంతయు
మెచ్చవచ్చును. (ప్రకాశముగా బలిం జూచి) ఓ దానవలోక
సార్వభౌమా !

సీ. ఇదినాకు నెలవని ♦ యేరీతిఁబలుకుదు
నొకచోటనకయెందు ♦ నుండనేర్తు
నెవ్వనివాఁడ నం ♦ చేమని నుడువుదు
నాయంతవాఁడనై ♦ నడవనేర్తు
నీ నడవడియని ♦ యెట్లు వక్కాణింతు
బూని ముప్పోకలఁ ♦ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు ♦ ననియేల చెప్పంగ
నేరుపులన్నియు ♦ నేననేర్తు

ఆ. నొరులుగారునాకు ♦ నొరులకునేనొదు
నొంటివాఁడఁజుట్ట ♦ మొకఁడులేదు
సిరియుఁ దొల్లిగలదు ♦ చెప్పెద నాయింకి
సుజనులందుఁదలఁచు ♦ సొచ్చియుందు.

ఆసంగతి యట్లుండనిమ్ము. వదాన్యులలోఁ బ్రసిద్ధుఁడవగు నీవ
నినమాట కీర్తిదంబును, కులార్హంబును, ధర్మయుతంబునై యున్నది.
నీ వంశము వారందఱును గురుణానువర్తనులు. సత్త్వమూర్తులు. రణము

నందుఁగాని వితరణమునందుఁగాని వెనుకంజవేయువారులేరు. మీ తాత లందఱును మహాకీర్తిఁ గాంచినవారు. అందుఁ బ్రహ్లాదుని కీర్తి యిట్టిదని వర్ణింపజాలను. అతని పినతండ్రియగు హిరణ్యాక్షుండు సమస్తలోకముల జయించి తనకుఁ బ్రతివీరుని గానక చరించుచుండ, శ్రీహరి వరాహరూపంబున నాతని వధించెను. ఆతని యగ్రజుఁడగు హిరణ్యకశిపుని పరాక్రమాదు లత్యద్భుతములు శ్రీమన్నారాయణుఁ డాతని కొఱకు నరహరి రూప, మెత్తవలసి వచ్చెను. భూసుర వేషమునఁ బురుహూతాదులు వచ్చి వేఁడఁగా, నీతండ్రి తన ప్రాణముల నొసంగి, చతుర్దశ భువన విఖ్యాతి నందినాఁడు. నీవా! బలపరాక్రమ శౌర్యంబులయందు నీ పితామహుల మించి, యింద్రుని దోలి మూఁడు లోకముల నేలుచుంటివి.

బలి—దేవా! నీవు నన్నింతగా స్తుతింపవలదు. నేను నీ యాశీర్వచనమునకును, దయకును బాత్రుఁడ. నాయందుఁ బరిపూర్ణ కృపఁ బూని నీకేమి కావలయునో కోరుము. నీయభీష్టముఁ దీర్చి నేను కృతార్థుఁడ నగుదును.

వామ—రజనీచరకులేంద్రా! రాజ్య సంపదలు గలిగినవాఁడు తన సంపదను గొంతవఱకు బూజ్యులకును, భూసురులకును, యాచకులకును వినియోగ పఱచఁడేని, వాని జన్మవ్యర్థము. త్రిభువనాధిపత్యము వహించిన నీవు వదాన్యులలో శ్రేష్ఠుఁడ వను కీర్తి జగంబులందు వ్యాపించియున్నది. నే నెన్నఁడును నిన్నేదియుఁ గోరియుండలేదు. నాకు యాచనకిదియే ప్రారంభము.

బలి—మహాత్మా! ఈ వాక్యంబు లన్నియు నేల? నీకోరిక సత్వరంబుగఁ దెలిపిన నేనెంతయు సంతసింతును.

వామ—నిర్జరారీ! నీకు నాయందున్న భక్తిచే నే యభీష్టము నైనను గోరుకొనుమని చెప్పితివికదా యని నేను సంతసించి, నాకది కావలె - నిది కావలెనని కోరువాఁడఁగాను.

ఆ-వె. ఒంటివాఁడ నాకు ♦ నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము ♦ మేరయొల్ల
గోర్కెదీర బ్రహ్మ ♦ కూకటి ముట్టెద
దానకుతుక సాంద్ర ♦ దానవేంద్ర.

శుక్రా—(తనలో) ఈ మాణవకుని కోరిక కడు మాయగ నున్నది.

బలి—(నవ్వుచు వామనునిఁ జూచి) భూసురా! ఎంత స్వల్పపు దానమడిగితివి. మనంబుననున్న యభీష్టము తెలిపినచో నే నేమైన మతియొక విధమున భావింతు నేమోయని సంశయించితివా! కాకున్న నిట్లు కోరుటయేమి? దాతయొక్క వైభవమునైన నీవు తలంపవలదా! యాచన మార్గము నీకుఁ దెలియనట్లున్నది.

మ. వసుధాఖండము వేడితో గజములన్ ♦ వాంఛించితో వాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్ ♦ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేరవున్నడుగ నీ ♦ భాగ్యంబులీపాటి గా
కసురేంద్రుండు పదత్రయంబడుగ నీ ♦ యల్పంబు నీనేర్చునే.

జాబా—(తనలో) "ఉట్టినెక్కలేనివాఁడు స్వర్గమున కెక్కునా?"

వామ—(బలిం గాంచి) వైరోచనా. నీవు భుజబలపరాక్రమమునఁ ద్రిభువనంబులఁ బాలించుచున్న చక్రవర్తివి. వదాన్యులలో శ్రేష్ఠుఁడవు. నిరంకుశశాసనుఁడవు. అర్థులు కోరినవాని నీయఁగలసమర్థుఁడవు. నిన్ను వారించువారెవ్వరు! కాని నాకు నీవు చెప్పిన వానితో నేమియుఁ బనిలేదు.

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నా♦కుం ముంజియో దండమో
వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్ ♦ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మమెక్కడ మహా ♦ కాంక్షాంచితంబైన మూ
డడుగుల్ మేరయ ద్రోపకిచ్చుటటి బ్ర♦హ్మాండంబు నాపాలికిన్.

తనకుఁ బ్రాప్తంబగునది లేశమైనను బదివేలని తలంచి తృప్తిఁ జెందిన మనుజుఁడు ధన్యుఁడు.

శా. ఆశాపాశము దాఁగదుర్నిదుపు, లే ♦ దంతంబు రాజేంద్ర వా
రాశిప్రావృతమేదినీవలయ సా ♦ మ్రాజ్యంబు సేకూరియున్
గాసింబొందిరి గాక వైన్యగయ భూ ♦ కాంతాదులున్నర్థకా
మాశంబాయఁగ నేర్చిరే మును నిజా ♦ శాంతంబులంజూచిరే.

సంతుష్టుఁడు త్రిలోకంబులయందును బూజింపఁబడును. సౌఖ్యమెప్పుడును నట్టి వానికే గలుగుచుండును. వానినే ముక్తికన్యక వరించును. మానవుని తేజము అసంతుష్టివలన జలధారచే ననలము సమయునట్లు చెడిపోవును. (ఇంచుక యూరకుండి) దానవేంద్రా! త్రిభువనాధీశ్వరుండవని నిన్ను నిఖిల మడుగుట నాకు ధర్మముగాదు. నాకుఁ దగినకొలఁది వేడికొనిన మూడడుగుల నేలనిమ్ము. అదియే నాకుఁ జాలును.

బలి—భూదేవోత్తమా! ఈమాత్రపు స్వల్పదానమునకు యోజింపవలయునా! నీయభీష్టము ననుసరించెదఁగాక. (ఆసనమునుండి లేచుచున్నాఁడు.)

శుక్రా—(తనలో) ఈదానము తుదకెట్లు పరిణమించునో (కొంచెమాలోచించి) ఈబ్రాహ్మణుఁడు సామాన్యుఁడుగాడు. (బలింజూచి రహస్యముగా) రాక్షసేంద్రా! నీవుదానమిచ్చుటకు సంసిద్ధుఁడవగుచుంటివాయేమి?

బలి—ఆచార్యా! ఈస్వల్పదానమునకుఁ బ్రయత్నము కావలయునా? ఈచిన్నవాని యభీష్టముఁ దీర్చలకున్న నాకు మఱియొక సుకృతమేమియున్నది?

శుక్రా—

సీ. దనుజేంద్ర యీఁతడు ♦ ధరణీసురుఁడు గాడు
దేవకార్యంబు సాధించుకొఱకు
హరివిష్ణుఁ డవ్యయుం ♦ డదితిగర్భంబునఁ
గశ్యపసూనుఁడై ♦ కలిగినాఁడు
ఎఱుఁగవీతని కోర్కి ♦ నిచ్చెదనంటివి
దైత్యసంతతి కుప ♦ ద్రవము వచ్చె
నీలక్ష్మిఁ దేజంబు ♦ నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చుఁ దా ♦ వాసవునకు

ఆ. మొనసి జగములెల్ల ♦ మూఁడుపాదంబుల
నఖిల కాయుఁడగుచు ♦ నాక్రమించు
సర్వధనము విష్ణు ♦ సంసర్జనము సేసి
బడుగు పగిది నెట్లు ♦ బ్రదికెదీవు.

నీవొసంగు దానము గ్రహించి యీతఁడు ఒక్క పదమున భూమియు, రెండవ పదంబున దివంబును నాక్రమించి, యున్నత మూర్తియై దిక్కులును గగనమును నిండినచో నీవెక్కడికిఁ బోవుదువు ? ఏ దానమువలన నాశము గలుగునో అట్టిది దానము కాదని తత్త్వవిదులు చెప్పిరి. వదాన్యుఁ డెప్పుడును దనకున్న భాగ్యమును నైదు భాగములుగా విభజించి, కామమునకు, యశమునకు, సర్థమునకు, ధర్మమునకు, నాశ్రితబృందములకును వినియోగించవలయును. ఉన్న ధనంబును దానమిచ్చునప్పుడు తనకుఁ జేటును గొఱఁతయు గలుగకుండ యోచించువాఁడు హానిఁ బొందఁడు. మఱియు నొక్క విశేషము గలదు.

ఆ. వారిజాక్షులందు ♦ వైవాహికములందుఁ
ప్రాణవిత్తమాన ♦ భంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము ♦ వొందదధిప

మ. కులమున్ రాజ్యముఁ దేజమున్ నిలుపుమీ ♦ కుబ్జుండు విశ్వంభరుం
డలఁతింబోఁడు త్రివిక్రమస్ఫురణవాఁ ♦ డైనిండు బ్రహ్మాండమున్
గలఁడే మాన్పనొకండు నావలుకులా ♦ కర్ణింపు కర్ణంబులన్
వలదీ దానము గీనముం బనుపుమా ♦ వర్ణిన్ వదాన్యోత్తమా.

జం. బా — (శుక్రునుద్దేశించి) దానమిచ్చువారు లేకగాని దానములకు భంగముసేయు సమర్థులు పెక్కండ్రు కలరు. ఆచార్యులవారు బలికేదో బోధించుచున్నారే.

బలి — (తనలో) ఆచార్యుండిట్లు చెప్పుచున్నాఁడు. నీకోరికఁ దీర్చెద నని యీ బ్రాహ్మణునితోఁ బలికియున్నాఁడను. ఇప్పుడేమి సేయుదును ? ఈ బ్రాహ్మణోత్తముఁడు గోరిన దానమునకు వెనుదీయుదునా ! గురువాక్యము ననుసరింతునా ! ఏమి సేయుటకును దోఁచకున్నది. నా స్థితిఁ యిప్పుడు "ముందుబోయిన నూయి, వెనుక కేగిన గోయి" యన్నట్లున్నది. ఈ బ్రాహ్మణునకు దానమొసంగకుంటినేని సత్యభంగమగును. గురుని వాక్యము ననుసరింపక యుంటినేని గురుద్రోహకారణదోషము సంభవించును. (ఆలోచించి) ఏమైనను సరే ! సత్యభంగమునకు నా చిత్తము సమ్మతింపదు. ధర్మవిదులు సత్యమే పరమధర్మమని పలికిరి. జగమంతయు సత్యమువలననే స్థాపింపబడినది. సమస్త దేవతలును, ఋషులును సత్యమునే గౌరవింతురు అట్టిచో నా సత్యవ్రతమునకు నేనెట్లు భంగము గావింపఁగలను

త్రిభు గారియగు సామ్రాజ్య లక్ష్మీధురంధర రమణీయ హేమరత్న సింహాసనాసీనుండగు ఈబలి; నిరంతర దానధారాపటలుండగు ఈబలి; వైరిజనప్రతాపాటోపగర్వభంజనుండగు ఈబలి; వివిధాశ్రిత విద్వద్గురుసుహృద్బాంధవానీకాయభాగధేయుండగు ఈబలి; ఆశ్రితజనరక్షణాదీక్షాబద్ధకంకణుండగు ఈబలి:— అసత్యవాదియైనని జగంబులు పరిహాసింపవా! అట్లొనర్చితి నేని, నా సత్యమునకు, శౌర్యమునకు, సత్కార్యజ్ఞానమునకు గర్వకరము కలుగును. నా పవిత్ర జీవితమునకు మాలిన్యము గలుగును. నా ధర్మవర్తనమునకు, నా పురుషార్థమునకు, నా గౌరవమునకు, నా శీలమునకును, భంగము కలుగును. నేను ఘోరనరక కూపమునఁ బడుదును. ఏ మనుష్యుఁడు తన్నుదా జయింపఁగలఁడో, ఎవ్వఁడు దూరాన్వేషణ తత్పరుఁడై యుండునో, ఎవఁడు సత్యధర్మములను చిత్తమునఁ జొప్పించుకొనుండునో, యట్టివానిని భాగ్యలక్ష్మి వరించును. నేఁడీ బ్రాహ్మణునకు దానమిచ్చుటకు సందేహించితినేని లోకము నన్నతి నీచదృష్టితోఁ జూచును. ఇంతవఱకు నా సత్ప్రవర్తనచే నార్జించిన యశము మన్నఁగలియును. అశాశ్వతములగు ప్రాపంచిక సౌఖ్యములకును, చంచలములగు సంపదలకును జలబుద్బుదము వంటి దేహమునకును, నాశించి, అసత్యమాడుటకు నా చిత్తము సమ్మతింపదు. ఈతఁడు మాయామానుషరూపుఁడగు హరియే యగుఁగాక! నా రాజ్యశ్రీల నెల్ల హరించుఁగాక! కీర్తియొక్కటే భూమిపై శాశ్వతంబుగ నిలుచునది. అవసరమయ్యెనేని సత్యవ్రత రక్షణార్థము నా ప్రాణములనైన నర్పించెదను.

శుక్రా— (బలిం జూచి) వైరోచనా! ఇంకను ఆలోచించుచుంటి వేమి? నా వాక్యమున కంగీకరింపుము. ఇందువలన నీకు హానియేమియు సంభవింపదు.

బలి—మహాత్మా ! నీవు నిశ్చయము వక్కాణించితివి. ఇయ్యది గృహస్థధర్మమే? తొలుత నెట్టిదియైనను నొసంగెదనని యీ వటుగుతోఁ బలికి యిప్పుడు నిరాకరించుట యెట్లు ? ఎట్టి దుష్కర్మునినైనను భరించెదనుగాని, సత్యహీనుని మాత్రము మోవఁజాలనని తొల్లిభూదేవి బ్రహ్మతోడఁ బలికియున్నది. సమరమునందు వెనుకకుఁ బోవుటకంటెను, పలికిబొంకుటకంటెను మానధనులకు మఱియొక నీచకార్యము లేదు.

శా. కారేరాజులు రాజ్యముల్ గలుగవే ♦ గర్వోన్నతిం బొందరే
వారేరీసిరి మూటఁగట్టికొని పో ♦ వంజాలిరే భూమిపై
బేరైనం గలదే శిబిప్రముఖులున్ ♦ బ్రీతిన్ యశఃకాములై
యీరేకోర్కులు వారలన్ మఱచిరే ♦ యిక్కాలమున్ భార్గవా.

నీవు చెప్పినట్లు ఈవటుఁడు శ్రీమన్నారాయణుఁడే యగుఁగాక ఇంతకంటె నాకు మఱియొక సుకృతమేమి కావలయును ? క్రతువులచేతఁగాని, తపములచేతఁగాని, పొడఁగనఁజాలని యీ మహాత్ముఁడు నాయొద్దకు యాచకుండై యరుదేరఁగా నిడరానిదేమున్నది ?

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై ♦ నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ ♦ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందుకరంబు క్రిందగుట మీఁ ♦ దైనాకరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యముల్ సతతమే ♦ కాయంబు నాపాయమే.

మ. నిరయంబైననిబంధమైన ధరణీ ♦ నిర్మూలంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ ♦ రానిమ్ము కానిమ్ము పో
హరియైనన్ హరుఁడైన నీరజభవుం ♦ డభ్యాగతుండైన నా
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా ♦ ధీవర్య వేయేటికిన్.

శ్రీహరియగు నీతఁడు నన్నడిగిన దానమిచ్చుచుండఁగా నాకేల నెగ్గుసేయును? చేయుఁగాక! కరుణించి యాతఁడేరక్షించును?రక్షింపడా! పోనిమ్ము, మేరువు తలక్రిందైనను, బారావారము లింకినను, నేనసత్య మాడను.

మత్తకోకిల—

ఎన్నఁడుం బరువేఁడఁబోఁడట ♦ యెక్కలంబట కెన్నఁడా
రన్నదమ్ములు నైన లేరఁట ♦ యన్ని విద్యలమూలకో
న్నిన్నెఱింగిన ప్రోడ గుజ్జట ♦ చేతులొగ్గివసింప నీ
చిన్నిపాపనిఁద్రోసిపుచ్చఁగ ♦ జిత్తమెత్తదు సత్తమా.

శుక్రా—(కోపముతో) ఏమీ! నిరంతరముని శ్రేయస్సుఁగోరుచుండు నావాక్యములు నీశ్రవణ రంధ్రముల యందుఁ బ్రవేశింప లేదుగా! కానిమ్ము గురుధిక్కార మొనర్చిననీవు పదభ్రష్టుఁడవయ్యె దవుగాక! దానమునకడ్డము గల్పించెదఁగాక. (నిష్క్రమించును)

జాబా—ఆచార్యులవారు ఎందులకో ఆగ్రహముతో వెళ్ళుచున్నట్లున్నారు.

బలి—(తనలో) గురుశాపతప్తుఁడనగుదును గాక! సమస్తరాజ్యశ్రీలును, తుదకుఁ బ్రాణములుఁ బోవుఁగాక! అసత్యమార్గమునకుమాత్ర మభిముఖుఁడనుగాఁ జాలను (ఎదుటఁజూచి) సేవకా! హేమకలశంబుతో విమలసలిలంబుఁ గొనిరమ్మని దేవికిఁ జెప్పుము. (తనలో)

ఆ. బ్రతుకవచ్చుఁగాక ♦ బహుబంధనములైన
వచ్చుఁగాకలేమి ♦ వచ్చుఁగాక
జీవధనములైనఁ ♦ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు ♦ మానధనులు.

వింధ్యావళి—(జలకలశంబుతోఁ బ్రవేశించును)

బలి—(వింధ్యావళి చేతనున్న కలశమందుకొని వామనుని జూచి)

క. రమ్మా మహార్ణవ కోత్తమ
లెమ్మా నీవాంఛితంబు ♦ లేదన కిత్తుం
దెమ్మా యడుగుల సీటు రా
నిమ్మా కడుగంగ వలయు ♦ నేటికిఁ గడవన్.

వామ— బలిని సమీపించి. తన పాదములను ముందునకుఁ (జాపు చున్నాడు)

జాబా—(తనలో) ఆహా?

మ. బలిదైత్యేంద్రకరగ్రయుక్తజల ♦ పరిక్షాళన ప్రాప్తికిన్
జలజాతాక్షుఁడు నా చెయి యోగిసుమన ♦ స్సంప్రార్థిత శ్రీదముం
గలితానమ్రసురనారాంగనాటపదన్ ♦ కస్తూరికాశ్యాదమున్
నలినామోదము రత్నసుస్ఫురిత నా ♦ నా వేదముం బాదమున్.

వదాన్యుఁడగు నీబలి యెంతయుఁ గృతార్థుఁడు.

బలి—(వామనుపాదములఁ గడిగి - ఆజలమును శిరముపైఁ జల్లుకొని) వామనా! విష్ణుస్వరూపుఁడవగు నీకు మూఁడడుగులభూమిని బ్రహ్మార్పితముగ ధారవోయుచున్నాఁడ. (వామనుని చేతి యందుఁ గలశజలంబులఁ బోయుచు) ఏమిది! కలశమునుండి జలము రాకయున్నది?

వామ—(తనలో) కలశమునుండి జలధార నడ్డగించుటకు శుక్రాచార్యుఁడిందుఁ బ్రవేశించినాఁడు. కానిమ్ము. (బలింజూచి) దానవలోక సార్వభౌమా! కలశరంధ్రమున నేదియో యడ్డముపడినట్లున్నది. (కుశచేఁ గలశరంధ్రమునఁ బొడుచును.)

బలి—ఇదిగో! జలధార వచ్చుచున్నది. (వామనుని హస్తమునఁ బోసి) మహాత్మా! నీవడిగిన దానము త్రికరణశుద్ధిగ నొసంగినాను.

జాబా—(తనలో)

ఆ. కమలనాభు నెఱిఁగి ♦ కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రుమాట ♦ లెఱిఁగి పాత్ర
మెఱిఁగి పాత్రమనుచు ♦ నిచ్చె దానము బలి
మహితదానశౌర్యుఁడు ♦ మఱియుఁ గలఁడె.

వామ—(బలిం జూచి) ఓ దానవలోకచక్రవర్తీ!

క. క్షితిదాన మిచ్చు నతఁడును
నతికాంతుఁ బరిగ్రహించు ♦ నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునఁ గ్రీడ ♦ సలుపుదు రెలమిన్.

ఏదానంబును వసుంధరాదానంబుతో సదృశము కాదు. నీవట్టి దానమొనర్చి మహాసుకృతంబు వడసితివి.

(శుక్రుఁడు ఒకకన్ను పోయినవాఁడై ప్రవేశించును.)

జాబా—(శుక్రాచార్యునిఁ జూచి) ఇది యేమి? ఆశ్చర్యము! దనుజాచార్యున కొకకన్ను పోయినది.

శుక్రా—నాయనా! మహాత్మున కొసంగు దానమున కడ్డము గల్పింపఁ దలఁచుటచే నాకీశిక్ష కలిగినది.

జాబా—పాపము! ఇఁక నెప్పుడును నట్టిది సేయవలదు. ఒకకన్నైన నుండును.

వామ—(విశ్వరూపము ధరించుచున్నాఁడు.)

శుక్రా—(ఆశ్చర్యముతో) ఆహా! అద్భుతము. మాయామాణవకుఁడు విశ్వరూపము ధరించినాఁడు. నేను బలితోఁ జెప్పినట్లేయైనది.

జగత్సృష్టిస్థితిలయకారణుఁడగు శ్రీహరిమాయల నెవ్వఁడు కనుఁగొనఁగలఁడు? (పరికించి) ఈజగన్నాయకుని రూపము బ్రహ్మాండమంతయు నిండిపోవుచున్నది.

జాబా—(భయము నటించి యిటునటు పరుగెత్తుచు) వామనా! ఈ రూపమేమి! అందఱిని బ్రమింగెదవాయేమి? చిన్నట్లేయుండి భూమ్యాకాశములను నొక్కఁడవే యాక్రమించినావు!

బలి—(తనలో) భగవంతుడగు శ్రీమన్నారాయణుఁడే నన్నీ విధంబున ననుగ్రహించుటకు బ్రాహ్మణ రూపంబున వచ్చెను. మదీయ పూర్వపుణ్యవశంబున నీతని నిజస్వరూపముఁజూడఁ గలిగితిని- (ప్రకాశముగా వామను నుద్దేశించి) హే! పురుషోత్తమా! నీవు సకలలోకములకును నాయకుఁడవు. బంధమోక్షములకుఁ బ్రభుఁడవు, ఆర్త శరణ్యుఁడవు. గురుఁడవు. సకల సృష్టిస్థితి సంహార కర్తవై - బ్రహ్మవిష్ణుశివాఖ్యల రాజిల్లుచుండువు. దేవా! మత్స్యాకృతిందాల్చి వార్ధిఁజొచ్చి, వేదములఁ ముచ్చిలిన సోమకాసురునిఁ జంపి, యవ్వేదములఁదెచ్చి యజునకిచ్చితివి. ఇంతకుమున్ను మేమును దేవతలును నమృతమునకై పోరాడునప్పుడు కమఠంబవై మందరగిరి వీపునఁదాల్చి, కపట మోహినీ రూపంబున నమృత మమరులకిచ్చి వారి కజరత్వా యురారోగ్యములఁగూర్చితివి. జగత్కంటకుడగుహిరణ్యాక్షుఁడు భూతలంబెల్లఁ జాపఁజుట్టిన చందంబునఁ జుట్టుచుండ, సూక రాకృతిందాల్చి నిజదంష్ట్రాగ్ర భాగమున వసుంధరను నిలిపి, దానవునిఁ గూల్చి లోకముల రక్షించితివి, బ్రహ్మవరగర్వమునఁ గన్నును మిన్నును దెలియక లోకములఁ గంపింపఁ జేయుచున్న హిరణ్యకశిపుని నరమృగరూపమున వధించి, తత్పానుండగు

ప్రహ్లాదుని రక్షించి, జగంబుల పరితాపము వాపితివి. నేడు నా నిమిత్త మీ వామన రూపంబున వచ్చితివి. మహాయోగీంద్రులకైనను దుర్లభమైన నీ నిజరూపము దర్శింపఁగంటిని. విగత దూరుఁడనైతిని. లక్ష్మీకళత్రా !

మ. సరసీజోద్భవశంకరాది సురల ♦ శ్రాంతంబు సేవింపఁ బె
ల్లిరవై యుండు మహానుభావుఁ డవు నీ ♦ వీభంగి భూమీసురే
శ్వరవేషంబున రాఁబనేమి నిజ రూ ♦ పస్ఫూర్తితో వచ్చినన్
బరమశ్రద్ధను దేవదేవ నిను నం ♦ భావించి పూజింపనే.

విష్ణుసేవకుఁడు—(ప్రవేశించి—బలిని బంధించి నిగ్రహించును)

శుక్రా—హా ! హా !

బలి—(తనలో) నాకిట్టిది సంభవింప వలసిన దేనా—(ఇంచుక యూరకుండి) దీనికి విచారింపనేల? శ్రీహరి నాయందిట్లు కృపవహించినాఁడు.

(తెరలో)

(ఓహో! రాక్షసులారా! చూచెదరేమి ! కపటవటుని వేషంబున వచ్చిన శ్రీహరియని యెఱుంగక మన బలిదానమిచ్చి యిట్లు బంధింపఁ బడినాఁడు. మనమింక నీ బ్రాహ్మణుని పోనీయక రూపుమాపుదము, రండు. రండు.)

వామ—(ఎదుటఁజూచి తనలో) మదీయ పరిచరులగు సునంద నంద జయ జయంతాదులు నిఖిలాయుధ సమేతులై యరుదేరఁగా రక్కసులు వారిని దాకుటకు సన్నద్ధులగుచున్నారు.

బలి—(ఎదుటఁజూచి రాక్షసుల నుద్దేశించి)

సీ. రాక్షసోత్తములార ♦ రండు పోరాడక
కాలంబు గాదిది ♦ కలహమునకు

సర్వభూతములకు ♦ సంపదాపదలకుఁ
ప్రభువైన దైవంబు ♦ బరిభవింప
మనమోపుదుమె; తొల్లి ♦ మనకు రాజ్యంబును
సురలకు నాశంబు ♦ సొరిది నిచ్చి
విపరీతముగఁ జేయు ♦ వేల్పు నేమందము
మనపాలి భాగ్యంబు ♦ మహిమఁ గాక

తే. వెఱచి పలుమాఱుఁ బాఱెడి ♦ విష్ణుభటులు
మిమ్ము నెగచుట దైవంబు ♦ మేకగాదె
మనకు నెప్పుడు దైవంబు ♦ మంచి దగును
నాఁడు గెలుతము పగవారి ♦ నేఁడు వలదు.

వామ—(తనలో) సంపదకు దూరుఁడైనను దైన్యముగాని, కంపము గాని యందక, ధైర్యచేతస్కుండై యీ బలి నిలిచియున్నాఁడు. (ప్రకాశముగా బలింగాంచి)'

సీ. దానము త్రిపదభూ ♦ తలమిత్తునంటివి
తరుణచంద్రార్కులెం ♦ దాక నుండు
నంత భూమియు నొక్క ♦ యడుగ య్యెనాకును
స్వర్లోకమును నొక్క ♦ చరణ మయ్యె
నన్న నీసొమ్ము రెం ♦ డడుగులఁ గలసెను
గడమపాదమునకుఁ గలదె చోటు
నిచ్చెద నన్నర్థ ♦ మీని దురాత్ముండు
నిరయంబు బొందుట ♦ నిజముగాదె

తే. కాన దుర్గతికిని గొంత ♦ కాలమరుగు
కాకయిచ్చెద వేని వే ♦ గంబనాకు

నిపుడు మూడవపదమున ♦ కిమ్ముఁజూపు
బ్రాహ్మణాధీనములుఁ దోఁప ♦ బ్రహ్మవశమె.

బలి—మహాత్మా! నాకుసత్యమే భూషణము. రాజ్యనాశనమునకుఁ గాని ప్రాణనాశమునకుఁగాని చింతింపను. సత్యమునే కాపాడు కొందును.

ఆ. సూనృతంబుగాని ♦ సుడియదు నాజిహ్వ
బొంకఁజాలనాకు ♦ బొంకు లేదు
నీతృతీయపదము ♦ నిజమునాశిరమున
నెలవుసేసి పెట్టు ♦ నిర్మలాత్మ.

ఆ. నిరయమునకుఁబ్రాప్తి ♦ నిగ్రహంబునకును
బలవిహీనతకును ♦ బంధనమున
కర్థభంగమునకు ♦ నావ్యసనమునకు
వెఱవ దేవ! బొంక ♦ వెఱచినట్లు.

సీ. తల్లిదండ్రులు పన్న ♦ దమ్ములుఁ జెలికాండ్రు
గురువులు శిక్షింపఁ ♦ గొఱఁతపడని
పిదపమేలగుఁగాక ♦ పృథుమదాంధులకును
దానవులకు మాకుఁ ♦ దఱియెఱింగి
విభ్రంశవశువు ♦ నెలయునిచ్చుటఁజేసి
గురువులలోనాది ♦ గురువపివ
నీవుబంధించిన ♦ నిగ్రహమో లజ్జ
హానష్టియో బాధ ♦ యోతలంప

తే. నిన్ను నెదిరించి పోరాడి ♦ నిర్జరారు
లాదియోగీంద్రులందెడు ♦ నట్టిటెంకి
నందరేతొల్లి పెక్కండ్రు ♦ హర్షమూర్తి
వైరభక్తులు గట్టిగా ♦ వలయుఁగాక

యీాశనీయెడ దుర్లభ ♦ మేమిగలదు.

మూఢాత్ములు సత్యదానకరుణాధర్మంబులకు దూరులై యీా సంసారము నిక్కమని తలంతురు.

సీ. చుట్టాలు దొంగలు ♦ సుతులు ఋణస్థులు
కాంతలు సంసార ♦ కారణములు
ధనములస్థిరములు ♦ దనువతి చంచల
కార్యార్థులన్యులు ♦ గడచుగాల
మాయువు సత్వర ♦ మైశ్వర్య మతిశీఘ్ర
మనికాదె తమతండ్రి ♦ నతకరించి
మాతాత సాధు స♦మ్మతుఁడు ప్రహ్లాదుండు
నీపాదకమలంబు ♦ నియతిఁజేరె
తే భద్రుఁడతనికి మృతిలేని ♦ బ్రిదుకుగలిగె
వైరులైకాని తొల్లి మా♦వారుగాన
రర్థివైవచ్చి నీవు న♦న్నడుగుటెల్ల
పద్మలోచన నాపుణ్య ♦ ఫలముగాదె.

ప్రహ్లాదుఁడు—(ప్రవేశించి వామనునిఁజూచి) దేవా! నీచరణంబులకు నమస్కరించుచున్నాను. (నమస్కరించును.)

బలి—(ప్రహ్లాదునిఁజూచి) పితామహా! మహానుభావుండగు శ్రీహరిచే వారుణపాశబద్ధుండ నగు నేను నీకుఁ గరంబులమోడ్చి నమస్కరింపఁజాలకయున్నాను. శిరమువంచి యొసంగు నావందనములఁ గైకొనుము.

ప్రహ్లా—(వామనునిఁజూచి) దేవా! జగన్నాథా!

సీ. ఇతనికి మున్న నీ ♦ వింద్రపదంబిచ్చి
నేఁడు త్రిప్పుటయును ♦ నెఱయమేలు

మోహనాహంకృతి ♦ మూలంబు గర్వాంధ
తమసవికారంబు ♦ దానిమాన్పి
కరుణరక్షించుట ♦ గాక బంధించుటే
తత్వజ్ఞునకు మహేం ♦ ద్రత్వమే"
నీపాదకమలంబు ♦ నియతిఁగొల్చినదానిఁ
బోలునే సురరాజ్య ♦ భోగపరత

తే. గర్వమే పారఁగన్నులు ♦ గానరావు
చెవులువినరావు చిత్తంబు ♦ జిక్కువడును
మఱచు నీసేవలన్నియు ♦ మహిమమాన్పి
మేలుసేసితి నీమేటి ♦ మేరసూపి.

వింధ్యావళి-(ప్రవేశించి వామనునకు నమస్కరించి)

ఉ. ఏపరమేశ్వరున్ జగము ♦ లిన్నిఁటి గప్పినమాయఁ గప్పగా
నోపక పారతంత్ర్యమున ♦ నుండు మహాత్మక యట్టినీకు ను
ద్దీపితభద్రమూర్తికి ను ♦ ధీజనరక్షణ వర్తికిం దనూ
తాపము వాయమ్రొక్కెద ను ♦ దారతపోధన చక్రవర్తికిన్.

క. నీకుం గ్రీడార్థములగు
లోకంబులఁ జూచిపరులు ♦ లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు
లోకములకు రాజు వీవ ♦ లోకస్తుత్యా.

క. కాదనఁడు సొమ్ములేవీ
రాదనఁడు జగత్త్రయైక ♦ రాజ్యము నిచ్చెన్
నాదయితుఁ గట్టనేటికి
శ్రీదయితా చిత్తచోర ♦ శ్రితమందారా!

దేవా! అఖిలజగన్ని యామకుండవగు నీవొనర్చు కార్యము కాదను వారెవ్వరు? నిజభుజబలపరాక్రమంబునఁ ద్రిభువనంబుల గెలిచి, నిరంతర సత్యవ్రతాచారపారీణుఁడై; ధర్మనంధుఁడై; దానకంకణ ధరుఁడై; విరాజిలు-నాభర్త నీవలన నిట్టి శిక్షకు బాత్రుఁడే! భక్తజన రక్షణ దీక్షాపరతంత్రుఁడవగు నీ కితని బంధించుట ధర్మమని తోఁచినదా! మహాత్మా! పతిభిక్షఁ బెట్టుము.

బ్రహ్మ—(ప్రవేశించి వామనునిఁజూచి)

సీ, భూతలోకేశ్వర ♦ భూతభావన దేవ
దేవజగన్నాథ ♦ దివ్యరూప
తనసొమ్ము సకలంబు ♦ దప్పకనీకిచ్చె
దండయోగ్యుఁడుగాఁడు ♦ దానపరుఁడు
గగుణింపనర్హుండు ♦ కమలలోచన నీకు
విడిపింపు మీతని ♦ వెఱపుఁదీర్చి
తోయపూరముచల్లి ♦ దుర్వాంకురంబులఁ
జేరి నీపదముల ♦ ర్చించునట్టి

తే. భక్తియుక్తుఁడు లోకేశ ♦ పదము నొందు
నీవు ప్రత్యక్షముగ వచ్చి ♦ నేడు వేఁడ
నెఱిఁగితన రాజ్యముఁ తయ్యు ♦ నిచ్చినట్టి
బలికిఁదగునయ్య కృథపాశ ♦ బంధనంబు.

వామ—(బలిని బంధవిముక్తునిఁ జేసి-బ్రహ్మనుజూచి) చతుర్ముఖా!
సీ. ఎవ్వనిఁగరుణింప ♦ నిచ్ఛయించితివాని
యఖిల విత్తంబు నే ♦ నపహరింతు
సంసార గురుమద ♦ స్తబ్ధుఁడై యెవ్వఁడు
దెగడిలోకము నన్ను ♦ ధిక్కరించు

నలఁడెల్లకాలంబు ♦ నఖిలయోనులయందు
బుట్టుచు దుర్గతిఁ ♦ బొందుపిదప
విత్తవయోరూప ♦ విద్యాబలైశ్వర్య
కర్మజన్మంబుల ♦ కర్మముడిగి

తే. యేకపథమున విమలుఁడై ♦ యెవ్వఁడుండు
వాఁడు నాకూర్చి ♦ రక్షింప ♦ వలయువాఁడు
స్తంభలోభాభిమానసం ♦ సారవిభవ
మత్తుఁడై చెడనొల్లఁడు ♦ మత్పరుండు.

శా. బద్ధుండై గురుశప్తుఁడై చలితుఁడై ♦ బంధుప్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవ ♦ క్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యముం గరుణయుం ♦ జొప్పేమియుం దప్పఁడు
ద్బుద్ధుండై యజయాఖ్య మాయ గెలిచెన్ ♦ బుణ్యుండితండల్పుఁడే.

చతుర్ముఖా! రాక్షసేంద్రుఁడగు నీతని మహత్త్వముఁ జూడవలయు ననియే నేనిట్లొనర్చితిని. నిర్మలాచారుండగు నీతఁడు సత్యము దప్పలేదు, ఈతని చరిత్రమునకే నెంతయు మెచ్చితిని. సావర్ణిమనువు వేళ నీతఁడు దేవేంద్రుఁడగును. తరువాత దేవతలకును దుర్లభమైన నా చోటికి రావించెదను. అందాక నీతఁడు మహేంద్ర వైభవమును మించిన వైభవంబును బొందుచు సుతలంబున నుండును - (బలిం జూచి) వైరోచనా! నీవు భయఁబందవలదు. నీవు సత్యదాన కరుణా గుణంబులచే నన్ను వశపఱచుకొంటివి. నీవిఁక సుతలంబున నుండుము. నీయాజ్ఞఁ దీర్చని నిర్జరారాతులను నా చక్రమే తెంచి ఖండించుచుండును. నిన్నును నీ వారిని నేను నిరంతరము రక్షించుచుందును.

బలి—మహాప్రసాదము—(ఇంచుక యూరకుండి) దేవా!

ఉ. ఎన్నఁడుఁ లోకపాలకుల ♦ నీకృపఁజూడని నీవు నేఁడు న
న్నున్నతుఁజేసి నా బ్రదుకు ♦ నోజయు నానతియిచ్చి కాచితీ
మన్ననలీదయారసము ♦ మాటల పెద్దతికంబు జాలవే
పన్నగతల్పనిన్నెఱిఁగి ♦ పట్టిన నాపదగల్గ నేర్చునే.

ప్రహ్లా—దేవా! బ్రహ్మాదిపూజిత పదుండవైన నీవు—క్రూరులమును గుత్సితాత్మ కులమును నగు మాయెడల నిట్లుప్రసన్నుఁడ వగుట చిత్రము.

ఆ. సర్వగతుఁడవయ్యు ♦ సమదర్శనుఁడవయ్యు
నొకట విషమవృత్తి ♦ నుందు దీవు
నిచ్చలేని వారి ♦ కీవు భక్తులు గోరు
తలఁపులిత్తు కల్ప ♦ తరువుమాడ్కి.

బలి—

తే. వత్స! ప్రహ్లాద మేలు నీ ♦ వారునీవు
సారిది మనుమనిఁదోడ్కొని ♦ సుతలమునకు
బయనమై పొమ్ము నేఁగదా ♦ పాణిసగుచు
జేరి రక్షింప దురితంబు ♦ సెందదచట.

(ప్రహ్లాదుఁడును—బలియు వామనునకు నమస్కరించి తమవారితో నిష్క్రమింతురు.)

ఇంద్రుఁడు—(ప్రవేశించి)

మ. జడులై నాకము గోలుపోవుసురలం ♦ జంభారినిం బ్రోవగా
వడుగై భూమిఁబదత్రయంబిడుటకై ♦ వైరోచనిన్ వేడి రెం
డడుగుల్ సాచి త్రివిక్రమస్ఫురణ బ్ర♦హ్మాండంబు దానిండుచుం
గడుమోదంబున నుండు వామనునకే ♦ కాలంబునన్ మ్రొక్కెదన్

(వామనునకు నమస్కరించును.)

వామ—(శుక్రాచార్యునిఁ జూచి) బలి యజ్ఞముసేయుచున్నాఁడుకదా!

ఆ. ఏమికొఱఁతవడియె ♦ నీతఁడిజన్నంబు
విస్తరింపు కడమ ♦ విప్రవర్య
విషమమయిన కర్మ ♦ వివరంబు బ్రాహ్మణ
జనులుసూచినంత ♦ సమతఁబొందు.

శుక్ర—దేవా! అఖిల కర్మంబులకును నీవే యధినాథుండవు. యజ్ఞేశుఁడవు. యజ్ఞపురుషుఁడవు. నీవు పరితుష్టి నొందినచోఁ గర్మములకుఁ గొఱంతలు కలుగునా! అయినను నీయానతి శిరంబునఁదాల్చి జన్నంబునందున్న కొఱంతఁదీర్చెద.

వామ—(ఇంద్రునిఁ జూచి) మహేంద్రా! ఇప్పుడు నీకానందము లభించినదికదా! ఇఁకనీ పరివారములో నమరావతిం జేరి సుఖముగా రాజ్యముఁ బాలింపుము.

ఇంద్రు—జగత్కర్తవగు నీమహామహిమను వర్ణింపఁజాలను. నానిమిత్తము శ్రమవహించిన నీకనేక నమస్కారము లర్పించుచున్నాను.

జాబా—(బ్రహ్మాదులను జూచి)

ఆ. బల్లిదంపుఁదోడు ♦ ప్రాపున నింద్రుని
కింద్రపదము నేఁడు ♦ యిట్లుగలిగె
దనకు సాధ్యుఁడైన ♦ తమ్ముఁడు గలిగిన
గోర్కులన్న కేల ♦ కొఱఁతయుండు.

క. పాఁడుగఁడు మేలముగం
డేఁడు భిక్షించియన్న ♦ కిచ్చెఁద్రిజగముల్
వేలుపులతల్లి కడపటి
చూలుంబోలంగఁ గలరె ♦ సోలయని తమ్ముల్

బ్రహ్మ—(ఇంద్రునిఁజూచి) మహేంద్రా! భగవంతుఁడగు శ్రీహరి కటాక్షమున నీకుమరల నమరలోక రాజ్యము లభించినది.

సీ. ధర్మంబె యాత • పత్రముగాఁగ నఖిల పరి
జానుగాఁగంబె • సింహాసనముగ
మునిజనాశీస్సులే • ఘనచామరలుగాఁగ
న్యాయవృత్తియె కృపా • ణంబుగాఁగ
దశదిశల్ వ్యాపించు • యశమె చేలముగాఁగ
సత్యంబె దివ్యధ్వ • జంబుగాఁగ
నే. బేదలమ్రొక్కు • నీరాజనముగాఁగ
దివ్యతేజమె మేటి • దివిటిగాఁగ.
తే. వరగుణుఁడాదిగ సకలవి • కృతులు నిన్ను
సంతతము భక్తిఁ గొల్వ రా • జసభయంబు
విడచి గావించెదవుగాక • విబుధలోక
పాలనంబును నాచంద్ర • తారకముగ.

జా బా — శ్రీధాసు

(తెరవాలును)

